శ్రీమతే రామానుజాయ నమః



శ్రీవేదాంతదేశిక ప్రణీతమైన

# భగవద్ధ్యాన సోపానమ్, న్యాసదశకమ్, కామాసికాష్టకమ్, వైరాగ్యపంచకమ్,

దేవరాజగురువు (ఎఱుమ్బియప్పా) అనుగ్రహించిన

# శ్రీశైలాష్టకమ్

సవ్యాఖ్యానం

ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామి

ఉభయవేదాన్త మహావిద్వాన్

ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్యస్వామివారి

117వ తిరునక్షత్రోత్సవ జ్ఞాపిక

2015

# భగవద్ధ్యాన సోపానమ్, న్యాసదశకమ్, కామాసికాష్టకమ్, వైరాగ్యపంచకమ్, శ్రీశైలాష్టకమ్ - సవ్యాఖ్యానం

ప్రథమ ముద్రణ : మే, 2015

ప్రతులు : 500

సందర్భము : ఉభయవేదాన్త మహావిద్వాన్, ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్యస్వామివారి 117వ తిరునక్షత్రోత్సవ జ్ఞాపిక

ప్రతులకు : డా॥ ఈ.ఏ. శింగరాచార్యులు
18-3-58/7, శాంతినగర్
కె.టి. రోడ్, తిరుపతి-517 507
సెల్ : 09885003420

డి.టి.పి. : శ్రీమతి జయలక్ష్మి
శ్రీచంద్రశేఖర్

ముద్రణ : సి.ఎన్. ప్రింటర్స్, తిరుపతి



శ్రీమతే రామానుజాయ నమః

# విజ్ఞాపనము

ఆచాంతోభయవేదాంతసాగరో గుణభాసుర: ।
జయతాత్ శేషసింహార్యదేశికో జయతాత్ జయతాత్ సదా ॥

అస్మత్పితృచరణులు **ఉ.వే. మహావిద్వాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్యస్వామివారి** శతాబ్ది మహోత్సవాలు 1999వ సంవత్సరంలో నిర్వహింపబడినప్పటినుండి ప్రతిఏడు వారి తిరునక్షత్రోత్సవ సందర్భంలో ఉభయవేదాంత పండితసభా నిర్వహణం, పండిత సమ్మానకార్యక్రమం, సంప్రదాయానికి చెందిన గ్రంథ ప్రచురణం– అనే ఈ మూడు కార్యక్రమాలు భగవద్భాగవతాచార్యానుగ్రహ ఫలంగా నిరంతరంగా కొనసాగు తున్నాయి. ఈ క్రమంలో **ఉ.వే. శ్రీమాన్ శ్రీ.న.చ. రఘునాథాచార్య స్వామివారు (వరంగల్), కీర్తిమూర్తులు ఉ.వే. శ్రీమాన్ టి.ఎ. కృష్ణమాచార్యస్వామివారు(తిరుపతి), ఉ.వే. శ్రీమాన్ కిడాంబి వేంకటాచార్య స్వామివారు (నరసాపురం), ఉ.వే. శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్య స్వామివారు(సింహాచలం), ఉ.వే. శ్రీమాన్ డా॥ ఎస్.వి. రంగరామానుజాచార్య స్వామివారు(హైదరాబాద్), ఉ.వే. శ్రీమాన్ సాతులూరు గోపాల కృష్ణమాచార్యస్వామివారు (సింహాచలం), కీర్తిమూర్తులు ఉ.వే. శ్రీమాన్ డా॥ ముడుంబై నరసింహాచార్య స్వామివారు (చెన్నై), ఉ.వే. శ్రీమాన్ తూపురాణి ఉడయవర్లుస్వామి వారు (విజయవాడ), ఉ.వే. శ్రీమాన్ డా॥ కందాడై రామానుజాచార్యస్వామివారు, ఉ.వే. శ్రీమాన్ కె.వి.రాఘవాచార్యస్వామివారు (హైదరాబాద్)** మొదలైన పలువురు ప్రసిద్ధ విద్వాంసులను సన్మానించుకొనే అదృష్టం కల్గింది.

అదేరీతిలో ఈ యేడు శ్రీమాన్ పితృపాదుల తిరునక్షత్రోత్సవాన్ని పురస్కరించు కొని మే 6వ తేది నుండి 8వ తేదీ వరకు నరసాపురంలో శ్రీ ఆదికేశవ ఎంబెరుమానార్ స్వామివారి కోవెల సమీపంలో శ్రీభాష్యకారభవనంలో ఉభయవేదాంతసభలు నిర్వహింపబడుతున్నాయి. ఈ సభలలో **విశాఖ వాస్తవ్యులు ఉ.వే. శ్రీమాన్ కె.వి.ఆర్. నరసింహాచార్య స్వామివారికి, శ్రీరంగం వాస్తవ్యులు ఉ.వే. శ్రీమాన్ శ్రీరంగం పరాశర లక్ష్మీనరసింహభట్టర్ వారికి** విశిష్ట పండిత సన్మానం సమర్పింపబడుతున్నది. ఈ కార్యక్రమాల చిహ్నికగా ప్రకృత గ్రంథం ముద్రింపబడుతున్నది.

ఇందులో, శ్రీ దేశికులు రచించిన భగవద్ధ్యానసోపానం, న్యాసదశకం, కామాసికాష్టకం, వైరాగ్యపంచకం – అనే స్తోత్రాల వాఖ్యానం ముద్రింపబడుతున్నది. ఈ వ్యాఖ్యానం, ఇంచుమించుగా, **కీర్తిమూర్తులు, కాంచీ మహావిద్వాన్ ప్రతివాది**

**భయంకరం అణ్ణంగరాచార్య స్వామి ద్రావిడ వాఖ్యానాన్ని** అనుసరించి రచింపబడినది. శ్రీదేశికులు, శ్రీ అణ్ణంగరాచార్య స్వామివారు, ఇద్దరూ కాంచీమండలమండనాయ మానులు. ఇద్దరూ అప్రతిమ ప్రతిభా పాండిత్యాలను కలవారు. సమకాలంలో **"సమానానాముత్తమశ్లోకులు".** వీరిద్దరి పట్ల పితృపాదులకు కల ఆదరం, భక్తి ఎనలేనిది. అందువల్ల పితృచరణుల ముఖోల్లాసకర కైంకర్యంగాఈగ్రంథం ముద్రింపబడుతున్నది.

ఈ స్తోత్రాల వ్యాఖ్యానంతో పాటు, ఆచార్య సార్వభౌములైన శ్రీవరవరమునుల విషయంగా వారి శిష్యులు ఎఱుమ్బియప్పా (దేవరాజగురువు) ప్రసాదించిన శ్రీశైలాష్టక మనే అద్భుత మధుర స్తుతి సవ్యాఖ్యగా ముద్రింపబడుతున్నది. ఈ స్తుతిలో, ముఖ్యంగా శ్రీవరవరమునుల **"శ్రీశైలేశే"**త్యాది నిత్యతనియన్ ఆవిర్భావ వృత్తాంతాన్నిగూర్చి, ఆ తనియన్‌కు సంప్రదాయంలో గల అసమానమైనస్థానాన్ని గూర్చి తెలుపబడింది. ఈ విధంగా ప్రకృత గ్రంథం శ్రీవైష్ణవసంప్రదాయానికి చెందిన ఇద్దరు మహాచార్యుల వైభవాన్ని ప్రకటించేది కావడం సహృదయుల ఆనందానికి కారణం కాగలదని భావిస్తున్నాను.

ఈ గ్రంథముద్రణకు ఆవశ్యకమైన ద్రవ్యాన్ని సమర్పించినవారు – **శ్రీమతి నారాయణమ్మ, శ్రీమాన్ ఎ.వి.ఎస్. రాజు గారు (హైదరాబాదు) దంపతులు.** శ్రీమాన్ రాజుగారు సహజకవి, ధార్మికులు, వైదికసంప్రదాయాభిమానులు, శ్రీరామానుజ సంప్రదాయ నిష్ఠులు. శ్రీమతి నారాయణమ్మ గారు కూడా **"పత్నీ సుదక్షిణేత్యాసీత్ అధ్వరస్యేవ దక్షిణా"** అనేరీతిలో భర్తకు అనురూపమైన మనస్సును, వృత్తిని కలవారు. శ్రీమాన్ రాజుగారు నిర్వహించే పలుసత్కార్యాలకు దోహదంచేసే స్వభావాన్ని, శ్రద్ధను కలవారు. ఈ గ్రంథముద్రణ కైంకర్యాన్ని చేస్తున్నందులకు వీరి కుటుంబానికి అన్నివిధాలా సమగ్రమైన శ్రేయస్సుకలగాలని మంగళాశాసనాలను చేస్తున్నాను. సహృదయ పాఠకలకు ఈ గ్రంథం ఆనందం కలిగించకలదని భావిస్తున్నాను.

**శ్రీమతాం శింగరార్యాణా మవతార మహోత్సవే ।**
**తద్దివ్యసంస్మృతిత్వేన గ్రంథోయం సంప్రకాశ్యతే ॥**
**సహృదయసారజ్ఞానాం మోదం తనుతాదయం గ్రంథః।**
**దేశికవరవరమునివర శుభకరవిభవప్రకాశకత్వేన ॥**

ఇట్లు నివేదించు
సహృదయవిధేయుడు

నరసాపురం
18-4-2015

**ఈ. రంగాచార్యులు**

# వినతి

శ్రీవేదాంతదేశికులు రచించిన పలుస్తోత్రాలలో భగవద్ధ్యానసోపానం ఒకటి. ఈస్తుతిలో, దేశికులు, తాము శ్రీరంగక్షేత్రంలో వేంచేసి ఉండే శ్రీరంగనాథుని అర్చామూర్తిని ఆపాదమస్తకం దర్శించి ఆనందించిన క్రమాన్ని వ్యక్తంచేశారు. ఈక్రమం, తిరుప్పాణ్ ఆళ్వార్ల అమలనాదిపిరాన్ ప్రబంధంలోని క్రమాన్ని సర్వథా పోలి ఉండడం, ఆప్రబంధంలోని అర్థాలను ఈస్తుతిలోని శ్లోకాలు అనుసంధించడం గమనించదగిన విషయం. దివ్యసూరుల ప్రబంధాలలో తిరుప్పాణ్ ఆళ్వార్ల అమలనాదిపిరాన్ ప్రబంధాన్నిమాత్రమే మునివాహన భోగమనే పేరుతో ద్రావిడ భాషలో వ్యాఖ్యానించిన దేశికులు, ఆదివ్యప్రబంధంలోని అర్థాలకు ప్రభావితులై, దానిని భగవద్ధ్యానసోపానమనే పేరుతో సంస్కృతీకరించారనే విషయం సుస్పష్టం. కేవలం 12 శ్లోకాలను కల్గినదైనా, ఈస్తుతి పలు వేదాంతతత్త్వాలను ఆవిష్కరిస్తున్నది. ఉపోద్ఘాత రూపమైనది మొదటి శ్లోకం, ఫలశ్రుతి రూపమైనది చివరి శ్లోకం కాకుండా మిగిలిన పదిశ్లోకాలలో ముందుగల తొమ్మిది శ్లోకాలు శ్రీరంగనాథుని మూలమూర్తి కీర్తించగా, పదవ శ్లోకం మూలమూర్తిని, ఉత్సవమూర్తిని కలిపి కీర్తించడం విశేషం.

**కాంచీ ప్రతివాది భయంకరమ్ అణ్ణంగరాచార్యస్వామివారు** శ్రీదేశికుల పలు స్తుతులకు నాతి సంగ్రహంగా, నాతి విస్తృతంగా వ్యాఖ్యానాలను ద్రావిడభాషలో రచించారు. భగవద్ధ్యానసోపానానికి **"సోపానదీపికా"** అనే పేరుతో శ్రీమాన్ స్వామివారు వెలయించిన ద్రావిడవ్యాఖ్య దేశికుల సూక్తులకు దివ్యసూరుల సూక్తులకు మధ్యగల పలు శబ్దార్థసామ్యాలను అందంగా నిరూపిస్తున్నది. ఆంధ్రపాఠక లోకానికి అందజేయాలనే ఉద్దేశ్యంతో ప్రస్తుతం ఆవ్యాఖ్య ఆంధ్రీకరింప బడింది. శ్రీదేశిక సూక్తి సుమమకరందాన్ని ఆస్వాదించగోరిన సాహిత్యరసికులైన, సహృదయపాఠకులకు ఈ గ్రంథప్రకాశనం ఆనందింపజేయ గలదని నమ్ముతున్నాను.

ఇట్లు నివేదించు
సహృదయవిధేయుడు
**ఈ.ఏ. శింగరాచార్యులు**

శ్రీమతే రామానుజాయ నమః



శ్రీవేదాంతదేశిక ప్రణీతమైన

# భగవద్ధ్యాన సోపానమ్

**( కాంచీ మహావిద్వాన్ శ్రీ ప్ర.భ. అణ్ణంగరాచార్య స్వామివారి "సోపాన దీపికా" ద్రావిడ వ్యాఖ్యకు అనువాదంతో )**

## అవతారిక

శ్రీ దేశికులు శ్రీరంగక్షేత్రంలో నిత్యవాసం చేయాలని తలచి,అక్కడకు వేంచేసినపుడు అనుగ్రహించిన స్తోత్రాలలో ఇది ప్రముఖమైనది. ఆళ్వార్లు అనుగ్రహించిన దివ్య ప్రబంధాలలో తిరుప్పాణ్ ఆళ్వార్లు అనుగ్రహించిన అమలనాదిపిరాన్ ప్రబంధంతో ఈ స్తుతి పోలినది. శ్రీరంగనాథుని దివ్యమంగళ విగ్రహసౌందర్యాన్ని పాదాది కేశాంతంగా అనుభవించడంలో ఈ రెండు దివ్యప్రబంధాలకు సామ్యం ఉన్నది. **"శ్రీరంగరాజ ధ్యానసోపానమ్"** అనే తిరునామాన్ని పెట్టకుండా **"భగవద్ధ్యానసోపానమ్"** అనే తిరునామాన్ని ఈ స్తుతికి పెట్టడం భగవచ్ఛబ్దవాచ్యత్వం శ్రీరంగనాథునియందే యోగరూఢమనే అభిప్రాయంతో – అని పెద్దలు అంటారు. సోపానమని మెట్టుకు పేరు. భక్తుల చిత్తవృత్తి శ్రీరంగనాథుని దివ్యపాదాలనుండి కిరీటపర్యంతం అధిరోహించ డానికి ఈ స్తుతి మెట్లవంటిది – అనే చమత్కారమైన ఉక్తి ఈ నామం. దీనితో భగవానుని సర్వావయవాలను ఒక క్రమంలో అనుభవించడం సంభవమని భావం.



**1) అంతర్జ్యోతిః కిమపి యమినా మంజనం యోగదృష్టేః**
**చింతారత్నం సులభమిహ నః సిద్ధిమోక్షానురూపమ్ ।**
**దీనానాథవ్యసనశమనం దైవతం దైవతానామ్**
**దివ్యం చక్షుః శ్రుతిపరిషదాం దృశ్యతే రంగమధ్యే ॥**

యమినాం = యోగులకు, కిమపి = అనిర్వచనీయమైన, అంతః జ్యోతిః = హృదయగుహలో ప్రకాశించే జ్యోతిస్సువంటిదై, యోగదృష్టేః అంజనమ్ = యోగ నేత్రాన్ని నిష్కల్మషంగా చేయగల సిద్ధాంజనంవంటిదై, ఇహ నః సులభం = ఇక్కడ ఎదురుగా మనకు సులభమై, సిద్ధిమోక్ష+అనురూపం = యోగసిద్ధిని కాని, మోక్షాన్ని

కాని కోరేవారికి కోరిన రీతిలో అనుగ్రహించగల్గిన, చింతారత్నం = చింతామణివంటిదై, దీన + అనాథ వ్యసనశమనం = అశక్తులం, అనాథులం అయిన మనవంటివారియొక్క విషయాంతరప్రావణ్యమనే – లౌకిక విషయాలలోని ఆసక్తి అనే – క్లేశాన్ని పోగొట్టగల్గినదై, శ్రుతిపరిషదాం = వేదరాశులకు, దివ్య చక్షుః = దివ్యనేత్రంవంటిదై, దైవతానాం దైవతం= దైవాలు అన్నిటికి గొప్పదైన దైవం (ఒకటి), శ్రీరంగమధ్యే దృశ్యతే = శ్రీరంగ విమానం మధ్యలో దర్శనమిస్తున్నది.

ఈ శ్లోకానికి తరువాతి శ్లోకంనుండి శ్రీరంగనాథుని శ్రీపాదాలు మొదలైన దివ్యావయవాలలో అభినివేశాన్ని (గొప్పభక్తి) పొంది పలుకబోతున్న శ్రీదేశికులు, మును ముందుగా, అవయవి (సమస్త దివ్యావయవాలతో కూడుకొన్న శ్రీరంగనాథుని దివ్య మంగళరూపం) విషయంలోని ప్రావణ్యంతో ఈ శ్లోకాన్ని పల్కుతున్నారు. శ్రీరంగ నాథుడని అంటూ స్పష్టంగా నిర్దేశించకుండా, జ్యోతిస్సు అని, అంజన మని, చింతామణి అని, దివ్యచక్షుస్సు అని, దైవతమని – ఈ విధంగా కొన్ని శబ్ద విశేషాలతో శ్రీరంగనాథుని నిర్దేశించడం నానాప్రమాణపుంజాలలోని దృష్టితోనే. **"కుழுమి త్తేవర్కుழாఙ్గళ్ కైతొழு చ్చోదివెళ్ళత్తినుళ్ళే ఎழுవదోరురువు ఎన్నెఞ్జుళ్ ఎழுమ్"** (నిత్యసూరులు సమూహం గంపులుగా చేరి అంజలి ఘటించే రీతిలో జ్యోతిఃప్రవాహం లోపలనుండి ఆవిర్భవించే అద్వితీయరూపం నా మనస్సులో ప్రకాశిస్తున్నది) అనే తిరువాయ్మొழி పాశురాన్ని అనుసరించి, **"యమినాం కిమపి అంతర్జ్యోతిః"** (యోగులకు అనిర్వచనీయమైన అంతర్జ్యోతి) అని పలుకబడింది. **"యోగదృష్టేః అంజనమ్"** (యోగదృష్టికి సిద్ధాంజనం) అనే సూక్తిలో కూడా **"యమినాం కిమపి"** అనే పదాలను అనుషంగం చేసికోవచ్చు. (కలుపుకొని అర్థం చెప్పవచ్చు).

**(యమినాం యోగదృష్టేః కిమపి అంజనమ్)** సిద్ధాంజనాన్ని అలంకరించుకొనని నేత్రానికి అరుదైన, గుప్తంగా ఉండే వస్తువు కన్పించదుకదా! భగవానుడు సిద్ధాంజనంగా ఇక్కడ చెప్పబడుతున్నాడు. దేశికులు, వరదరాజపంచాశత్ అనే స్తుతిలో – **"సిద్ధాంజనేన భవతైవ విభూషితాక్షాః.... మాయానిగూఢ మనపాయ మహానిధిం త్వాం పశ్యంతి"** (నీచేతనే సిద్ధాంజనంతో అలంకరింపబడిన నేత్రాలను కల యోగులు గుప్తంగా ఉండేవాడవు, తరగని గొప్ప నిధివి అయిన నిన్ను దర్శిస్తున్నారు) అని అనుగ్రహించిన సూక్తి ప్రకృతంలో అనుసంధేయం. యోగులు యోగాన్ని చేసి సాక్షాత్కరించుకోవాలని ప్రయత్నం చేసినా, భగవానుడు తనను తానే దర్శింపజేసి అనుగ్రహిస్తే తప్ప, అతనిని దర్శించడం వారికి వీలు కాదు – అనే అభిప్రాయం ఇక్కడ వివక్షితం. అందువల్లనే భగవానుని సిద్ధాంజనంగా దేశికులు పలికారు.

**(ఇహ నః సులభం చింతారత్నమ్)** – ఆఴ్వార్లు భగవానుని **"శిన్దామణియే!"** (చింతామణీ!) అని సంబోధిస్తారు. భట్టర్ **"శ్రీస్తనాభరణం తేజః శ్రీరంగేశయ మాశ్రయే, చింతామణి మివోద్వాంత ముత్సంగేఽ నంతభోగినః"** (ఆదేశేషుని ఒడిలో అతడు వెడలగ్రక్కిన చింతామణివలె ఉండేవాడు, శ్రీదేవి వక్షఃస్థలానికి ఆభరణమైనవాడు, తేజోరూపుడైన శ్రీరంగనాథుని ఆశ్రయిస్తున్నాను) అని అన్నారు. చింతించినమాత్రం లోనే సర్వస్వాన్ని అనుగ్రహించగల్గిన ఒక రత్నవిశేషం చింతామణి అనబడుతుంది. అది లోకంలో సులభమైనది కాదు; అరుదై ఉంటుంది. అది ఇక్కడ శ్రీరంగం విమానంలో సులభమై శ్రీరంగనాథుని రూపంలో ఉన్నది – అని భావం.

**(సిద్ధిమోక్షానురూపమ్)** ఇక్కడ సిద్ధి అంటే యోగసిద్ధి. అది ఈ విభూతిలోనే పొందదగినది. దానిని కోరితే దానిని, మోక్షాన్ని అభిలషిస్తే దానిని అనుగ్రహించ గల్గినవాడుకదా భగవానుడు.

**(దీనానాథవ్యసనశమనమ్)** – అకించనులై, అనన్యగతికులై (ఏ ఆలంబాన్ని, రక్షకుని లేకుండా) ఉండేవారికి దుఃఖశాంతిని కల్గించగల్గినది – అని భావం.

**(దైవతానాం దైవమ్)** – దైవమనే పేరును కల్గినవారికి అందఱికి శ్రేష్ఠమైన దైవం.

**(శ్రుతిపరిషదాం దివ్యం చక్షుః)** – భగవానుడు వేదరాశులకు అన్నిటికి దివ్యమైన చక్షుస్సు. **"వేదై శ్చ సర్వై రహమేవ వేద్యః"** (అన్ని వేదాలచే తెలియబడేవాడను నేనే) అనే గీతాచార్యసూక్తిని ఇది వివరిస్తున్నది. ఈ రీతిలో ఇటువంటి ఒక పరంజ్యోతిని **"యాన్ కణ్డతు అణినీర్ తెన్నరఙ్గత్తే"** (నేను, గొప్ప నీటిని కల దక్షిణాదిక్కులోని శ్రీరంగంలో దర్శించాను) అని అంటున్నారు.

**2) వేలాతీతశ్రుతిపరిమళం వేధసాం మౌళిసేవ్యం**
**ప్రాదుర్భూతం కనకసరితః సైకతే హంసజుష్టే।**
**లక్ష్మీభూమ్యోః కరసరసిజైః లాలితం రంగభర్తుః**
**పాదాంభోజం ప్రతిఫలతి మే భావనాదీర్ఘికాయామ్ ॥**

వేలాతీతశ్రుతిపరిమళం = అవధి దాటిన వేదపరిమళాన్ని కల్గినది, వేధసాం మౌళిసేవ్యం = బ్రహ్మపదవిలో ఉండేవారికి అందఱికి శిరస్సుతో నమస్కరించదగినది, హంసజుష్టే = హంసలచే సేవింపబడే, కనకసరితః = కావేరీనదియొక్క, సైకతే = ఇసుకతిన్నెలో(శ్రీరంగక్షేత్రంలో), పాదుర్భూతం = ఆవిర్భవించినది, లక్ష్మీభూమ్యోః = శ్రీదేవి, భూదేవుల, కరసరసిజైః = శ్రీకరాలనే పద్మాలతో, సేవితం = సేవింపబడేది అయిన, రంగభర్తుః = శ్రీరంగనాథుని, పాద + అంభోజమ్ = శ్రీచరణపద్మం, మే =

నా యొక్క దాసుని, భావనాదీర్ఘికాయాం = చింతన అనే బావిలో, ప్రతిఫలతి = ప్రతిబింబిస్తున్నది.

**"నీళ్మదిళ్ అరఙ్గత్తమ్మాన్"** (పొడుగైన ప్రాకారాలను కల శ్రీరంగ క్షేత్రానికి స్వామియైన శ్రీరంగనాథుని) శ్రీచరణపద్మం అనవరతం తమ చింతనలోనే నిలచి ఉన్నదని ఈ శ్లోకంలో అంటున్నారు. **"వేలాతీతశ్రుతిపరిళమ్"** అనే పదాన్ని ప్రతిపదార్థంలో తెల్పినట్లుగా బహువ్రీహి సమాసంగా గ్రహించి, "అవధిని మించిన శ్రుతి పరిమళాన్ని కల్గినది" – అని అర్థం చెప్పడమే పొసగుతుంది. కొందరు, **"వేలాతీత"** అనే పదాన్ని శ్రుతికి విశేషణంగా చేసి, "అంతు లేని వేదాల పరిమళంయొక్క రూపంగా ఉండే శ్రీచరణాలు" – అనే అర్థాన్ని చెప్పారు. అనంతాలైన వేదాలు – **"సర్వే వేదా యత్పద మామనంతి"** (అన్ని వేదాలు ఏ శ్రీరంగనాథుని పదాన్ని తెల్పుతున్నదో) అనే రీతిలో భగవత్పాదారవింద ప్రతిపాదనంతోనే పరిమళాన్ని పొందినవి – అనేది ఆ ప్రయోగంయొక్క అర్థమని వారు అంటారు. **"వేలాతీతశ్రుతిపరిమళమ్"** అనే ప్రయోగం పాదారవిందానికి విశేషణమైనందువల్ల ముందు చెప్పబడ్డ బహువ్రీహిసమాసార్థమే సరసం. యాదవాభ్యుదయంలోని అయిదవ సర్గలో – **"నిత్యాపూర్వశ్రుతిపరిమళం ... పాదాంభోజమ్"** (95వ శ్లో.) (నిత్యమైన, అపూర్వమైన వేదాల పరిమళాన్ని కల్గినవి) అనేచోట అప్పయ్య దీక్షితులవారు బహువ్రీహి సమాసంగానే వ్యాఖ్యానించడం కూడా దీనికి పొసగుతుంది. "పరిమళాన్ని కల్గినది" అని అనడంకంటే, "పరిమళస్వరూపమైనది" – అని అనడంలో విశేషం ఉన్నందు వల్ల, తత్పురుష సమాసంగా గ్రహించమే సరసం– అనే వాదం ఇక్కడ పొసగదు. ఎందుకు? అంటే, పరిమళశబ్దం నిత్యపుంలింగం అయినందువల్ల, బహువ్రీహిగా గ్రహిస్తే తప్ప ఈ ప్రయోగం కుదరదు. పాదాంభోజమనే కర్తృపదం ప్రథమావిభక్త్యంతం అయినందువల్ల బహువ్రీహివివక్ష లేనపుడు **"వేలాతీత శ్రుతిపరిమళః"** అని విసర్గాంతం గానే ఉండి ఉండాలి. ఆ విధంగా ప్రయోగం లేనందు వల్ల బహువ్రీహి సమాసంగా గ్రహించడం తప్పని సరి – అని భావం. "వేలాతీతశ్రుతులను పరిమళంగా కల్గినది"– అనికూడా చెప్పవచ్చు. లోకంలో తామరపూవుయొక్క పరిమళం స్వల్పం. అదికూడా కాదాచిత్కం. శ్రీచరణాలనే ఈ తామరపూవుల పరిమళం ఆ విధంగా కాకుండా, అపరిమితంగాను, సార్వకాలికంగాను ఉన్నది – అనే భావం ఇక్కడ వివక్షితం. **"వేలాతీత"** అనే ప్రయోగంలో ఈ రెండు అర్థాలు స్ఫురిస్తాయి. **"వేలా కాలమర్యాదయోరపి"** (వేలా– అనేపదం కాలం, అవధి – అనే అర్థాలను ఇస్తుంది) అనే అమరకోశవచనాన్ని, **"వేలా కాలే చ సీమాయామ్"** అనే మేదినీ నిఘంటువచనాన్ని అనుసరించి వేలాశబ్దం అవధిని, కాలాన్ని తెలుపుతుంది కనుక,

అంతు లేని పరిమళాన్ని కల్గినది – అని, కాలాతీతమైన (సర్వకాలవర్తి అయిన) పరిమళాన్ని కల్గినది – అని అర్థాలను చెప్పడంలో కొఅత లేదు.

ఇక్కడ శ్రుతిశబ్దంద్వారా తిరువాయ్‌మొழி అనే ద్రావిడశ్రుతిని వివక్షించి, అందులోని మొదటి పాశురంలో **"తుయరఱు శుడరడి"** (దుఃఖాన్ని తీర్చే ప్రకాశించే శ్రీచరణాలు) అని పాదారవిందప్రస్తావాన్ని చేసినందువల్ల, ఆ శ్రీచరణం పరిమళాన్ని కల్గినది – అని వ్యాఖ్యానించడం చాలా సరసం. **"వాన్ తికழుమ్ శోలై మదిళరఙ్గర్ వణ్‌పుకழ் మేల్ ఆన్ఱ తమిழ் మఱైకళ్ ఆయిరముమ్ ఈన్ఱముదల్ తాయ్ శడకోపన్"** (ఆకాశాన్ని తాకే తోటలను కల్గినది, ప్రాకారాలను కల్గినది అయిన శ్రీరంగంలోని శ్రీరంగనాథుని కల్యాణగుణాలను గూర్చి రచింపబడిన ద్రావిడ వేదరూపాలైన వేయి పాశురాలను కన్నతల్లి – శ్రీశఠకోపులు) అని అంటూ పరాశర భట్టర్ తిరువాయ్‌మొழி ప్రబంధం శ్రీరంగనాథుని ఉద్దేశించి రచింపబడినదని అన్నారు కదా! **"ముకిల్ వణ్ణనడిమేల్ శొన్న శొల్‌మాలై"** (మేఘవర్ణుడైన శ్రీరంగనాథుని శ్రీచరణాలను ఉద్దేశించి రచింపబడిన వాఙ్మాలిక) కదా తిరువాయ్‌మొழி ప్రబంధం. యతిరాజ సప్తతిలో **"యస్య సారస్వతం స్రోతో వకుళామోదవాసితమ్, శ్రుతీనాం విశ్రమాయాలం శఠారిం తముపాస్మహే"** (ఏ శఠకోపుల సారస్వతమనే ప్రవాహం వకుళపుష్పసుగంధంతో కూడినదో, శ్రుత్యర్థాలను ప్రతిపాదిస్తున్నదో, ఆ శఠకోపులను ఉపాసిస్తున్నాను) అని కీర్తింపబడిన నమ్మాழ்వార్ల దివ్యసూక్తి కనుక, **"శ్రుతిపరిమళమ్"** అనేది ఇదే అని అనడం చాలా ఉచితం. **"వేలాతీత"** శబ్దాన్ని శ్రుతికి విశేషణంగా గ్రహిస్తే, సర్వాధికారం– అందఱిచే అభ్యసించదగినది – అయిన శ్రుతి – అని తిరువాయ్‌మొழிని సుస్పష్టంగా తెలిపినది కాగలదు. దానినే పరిమళంగా కల్గినది – శ్రీరంగనాథుని పాదాంభోజం – అని భావం.

**(వేధసాం మౌళిసేవ్యమ్)** అనాది అయిన సంసారంలో బ్రహ్మపట్టాన్ని పొందిన వారు లెక్కలేనంతమంది కనుక, **"వేధసామ్"** అనే బహువచన ప్రయోగం చేయబడింది. దశావతారస్తోత్రంలో కూడా **"ప్రత్యాదిష్ట... యాదృచ్ఛికాద్వేధసామ్"** అని బహువచనం ప్రయోగింప బడింది. ఇంకా ఇదే రీతిలో పలు సందర్భాలలోని దేశికసూక్తులలో (బ్రహ్మల విషయంలో) బహువచన ప్రయోగమే ఉన్నది. పాదాంభోజమని అంటూ శ్రీచరణాన్ని పుష్పంగా పల్కినదానికి అనుగుణంగా **"మౌళిసేవ్యమ్"** అని ప్రయోగింపబడింది. పలువురు బ్రహ్మదేవుల శిరస్సులలో వికసించిన (తామర) పూవు – శ్రీరంగనాథుని శ్రీచరణ ద్వంద్వం. **"అమరర్ శెన్నిప్పూవినై"** (దేవతల శిరస్సులలోని పూవువంటివానిని) అని భగవానునే అమరుల శిరస్సులకు పూవుగా తిరుమఙ్గై యాழ்వార్లు అనుగ్రహించారు.

**"కోలమా మెన్శెన్నిక్కు ఉన్ కమలమన్న కుఱైకழలే"** (పద్మాలవంటి నీపాదాలు నా శిరస్సుకు అలంకారం) అని, **"అడిచ్చియోమ్ తలైమిశై నీ అణియాయ్ ఆழியమ్ కణ్ణా! ఉన్ కోలప్పాదమ్"** (శ్రీకృష్ణా! నీ అందమైన పాదాలను దాసురాంద్రమైన మా శిరస్సులపై అలంకరించు) అని చెప్పబడిన రీతిలో శిరోధార్యత్వం భగవానుని శ్రీచరణాలకు చాలా పొసగుతుంది. కనుక, **"మౌళిసేవ్యం పాదాంభోజమ్"** (శిరస్సు ధరించదగిన పాదపద్మం) అని ప్రయోగింపబడింది. శ్రీరంగనాథుని శ్రీచరణాలను విశేషించి బ్రహ్మ తన ఆరాధనలోని సేవించిన వృత్తాంతం పురాణప్రసిద్ధం కదా! అంతేకాక, ఆ వృత్తాంతం **"ఎమ్మాణ్పిన్ అయన్ నాన్గు నావినాలుమ్ ఎడుత్తేత్తి"** (బ్రహ్మ తన నాల్గు ముఖాలతో ప్రస్తావించి, స్తుతించి) అనే పెరుమాళ్ తిరుమొழி పాశురం తోను, **"సర్గాభ్యాసవిశాలయా నిజధియా కల్పానేవ బహూన్ కమండలుగలత్ గంగాప్లుతోఽపూజయత్, బ్రహ్మా త్వాం ముఖలోచనాంజలిపుటైః పద్మై రివావర్జితైః"** (ఎల్లప్పుడూ సృష్టిచేసే అభ్యాసంవల్ల మిక్కిలి విస్తృతమైన తనబుద్ధితో బ్రహ్మ పలు కల్పాల కాలం, తన నాల్గు ముఖాలనే పద్మాలతో తన కమండలంనుండి జాలువారే నీటితో స్నానం చేసి నిన్ను ఆరాధించాడు) అని, **"మన్వన్వవాయే ద్రుహిణే చ ధన్యే"** (ధన్యమైన బ్రహ్మవంశంలో) ఇత్యాదిగా గల శ్రీరంగరాజస్తవసూక్తులవల్ల ఈ విషయం విశదమవుతున్నది. వీటిని అన్నిటినీ ఉద్దేశించియే ఇక్కడ **"వేధసాం మౌళిసేవ్యమ్"** అని అనబడింది.

**(హంసజుష్టే కనసరిత సైకతే ప్రాదుర్భూతమ్)** – లోకంలో తామరపూవు బురదలో పుడుతున్నదే తప్ప, ఇసుకలో గాని, ఇసుకతిన్నెలోగాని మొలవదు. (పుష్పించదు). ప్రకృతంలో అనుభవింపబడే తామరపూవు– **"తిడర్ విళఙ్గు కరైప్పొన్ని నడువు పాట్టు"** (ఎత్తైన ఇసుక తిన్నెలు ప్రకాశించే కావేరీనది మధ్యభాగం) లో ఆవిర్భవించినది కనుక, **"సైకతే పాదుర్భూతమ్"** (ఇసుక తిన్నెలో ఆవిర్భవించినది) అని చాలా అతిశయంగా, ఆశ్చర్యకరంగా దేశికులు పలికారు. కావేరీనది ద్రావిడభాషలో **"పొన్నియాఱు"** అని, సంస్కృతంలో **"హేమాపగా"** అని **"కనకసరిత్"** అని చెప్పబడు తున్నది. బంగారాన్ని కొట్టుకొనివస్తూ ప్రవహిస్తున్నది – అనే కారణంచేత, కావేరీనది ఇసుకలో చాలా సన్నని బంగారపు కణాలు ఉంటాయనే ప్రసిద్ధివల్ల కావేరికి ఈపేరు వచ్చినదని పెద్దలు అంటారు. **"హంసజుష్టే"–** అనే విశేషణం ద్వారా **"మెన్నడై యన్నమ్ పరన్దు విళైయాడుమ్"** (అందమైన నడకలను కల హంసలు సంచరించే) అనే ప్రసిద్ధి తెలుపబడుతున్నది. **"శిఱ్ఱెయిఱ్ఱు ముఱ్ఱిల్ మూఙ్గిల్ మూన్ఱు దణ్డర్ ఒన్దినర్, అఱ్ఱ పఱ్ఱర్ శుఱ్ఱి వాழுమ్ అన్దణీరరఙ్గమ్"** (చిన్న చిన్న కణుపులను కల,

దృఢమైన మూడు వెదుళ్ళతో చేయబడిన త్రిదండాలను ధరించేవారు, లౌకిక సంగాన్ని లేనివారు, భగవద్భక్తులైన శ్రీవైష్ణవ యతులు సంచరించి నివసించే అందమైన చల్లని నీటిని కల శ్రీరంగం) అనే తిరుమఱిశైప్పిరాన్ పాశురక్రమంలో, పరమహంస పరివ్రాజకాచార్యులు చేరి ఉండే రీతిని ఈ ప్రయోగం తెలుపుతున్నది. ఆళవన్దార్, ఎమ్బెరుమానార్, ఎమ్బార్, అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్, నఞ్జీయర్ మొదలైన పరమహంసలు, మహాచార్యులు నిత్యం నివసిస్తూ సేవించే చోటుకదా, శ్రీరంగం. **"ఎన్నముదినై క్కణ్ణ కణ్గళ్ మఱ్ఱొన్ఱినై క్కాణావే"** (అమృతం వంటి నా శ్రీరంగనాథుని సేవించిన కన్నులు ఇంకొక వస్తువును చూడవు) అని అనుభవించిన తిరుప్పాణ్ పెరుమాళ్‌కు వాహనమైన లోకసారంగమహామునులను ప్రకృతంలో స్మరించాలి. పూర్వం **"వేధసాం మౌళిసేవ్యమ్"** అని బ్రహ్మయొక్క ప్రస్తావం ఉన్నందువల్ల, బ్రహ్మ, భగవానుని సేవార్థంగా ఇక్కడకు వచ్చేటపుడు అతనికి వాహనంగా వచ్చిన హంస కావేరినదీసైకత స్థలంలో అభినివేశాన్ని పొంది అచట నిలచిన సన్నివేశాన్ని ఈ ప్రయోగం తెల్పుతున్నదని కూడా చెప్పవచ్చు.

**(లక్ష్మీభూమ్యోః కరసరసిజైః లాలితమ్)** శ్రీరంగనాథుని శ్రీచరణాలు **"వడివిణై యిల్లా మలర్మకళ్ మఱ్ఱ నిలమకళ్ పిడిక్కుమ్ మెల్లడి"** (సాటిలేని రూపాన్ని కల లక్ష్మీదేవి, ఇంకా, భూదేవి సేవించే మృదుపాదాలు) కదా! **"పద్మాధాత్రీకరాబ్జాం పరిచితచరణం రంగరాజమ్"** (లక్ష్మీదేవి, భూదేవుల శ్రీకరాలతో సేవింపబడే పాదాలను కల శ్రీరంగనాథుని) అని, **"శ్రీరంగేశయజంఘే శ్రీభూమ్యోశ్చ హర్షకంటకితే"** (శ్రీదేవి భూదేవుల స్పర్శచేత పులకారికురాలను కల్గినవి) (శ్రీరంగరాజస్తవంలో) అని భట్టర్ అనుగ్రహించారు. "లోకంలో రాజులను రాజులు ఆదరిస్తారు; విద్వాంసులను విద్వాంసులు ఆదరిస్తారు" అనే రీతిలో తామరను తామర ఆదరిస్తున్నదని అనడం పొసగుతున్నది కనుక, పాదాంభోజాన్ని కరసరసిజం లాలిస్తున్నది– అని పల్కడం ఒక సరసోక్తి. అందువల్ల, ఈ రీతి ఉండే శ్రీరంగనాథుని చరణద్వయి–

**(మే భావనాదీర్ఘికాయాం ప్రతిఫలతి)** – దేశికులు తమ చింతనను ఒక బావిగా రూపించి, అందులో ప్రతిఫలిస్తున్నదని అంటున్నారు. జలాశయంలో ఉన్నది జలాశయం లోనే ప్రతిఫలిస్తుంది కనుక, పూర్వ శ్లోకంలో **"కనకసరితః"** అని పల్కిన సూక్తికి అనుగుణంగా ఇక్కడ **"భావనాదీర్ఘికాయామ్"** అని ప్రయోగింపబడింది.

**3) చిత్రాకారాం కటకరుచిభి శ్చారువృత్తానుపూర్వాం**
**కాలే దూత్యద్రుతతరగతిం కాంతిలీలాకలాచీమ్ ।**

**జానుచ్ఛాయాద్విగుణసుభగాం రంగభర్తు ర్మదాత్మా**
**జంఘాం దృష్ట్వా జననపదవీజాంఘికత్వం జహాతి ॥**

కటకరుచిభిః = శ్రీపాదాలలోని అందెల కాంతులతో, చిత్ర + ఆకారామ్ = నానావర్ణాత్మకమైన రూపాన్ని కల్గినది, చారువృత్త + అనుపూర్వాం = అందమైనది, గుండ్రని ఆకారాన్ని కల్గినది, పైభాగానికి అనుగుణమైనది, కాలే = పాండవదూతగా (హస్తినకు) వెళ్ళిన సమయంలో, దూత్యద్రుతతరగతిం = దూత్యంకోసం మిక్కిలి వేగమైన గమనాన్ని కల్గినది, కాంతిలీలా కలాచీమ్ = కాంతిని పూర్తిగా ధరించడానికి వీలైన (తుమ్మపడిగం వంటి) ఒక పాత్రవంటిది, జానుచ్ఛాయా ద్విగుణసుభగాం = ముంగాళ్ళ కాంతితో రెండింతలైన కాంతిని కల్గిన, రంగభర్తుః జంఘాం = శ్రీరంగనాథుని పిక్కలను, మత్ ఆత్మా దృష్ట్వా = నా మనస్సు చూచి (సేవించి), జనన పదవీ జాంఘి కత్వం = సంసారపదవిలో (మార్గంలో) పరుగు తీసే స్వభావాన్ని, జహాతి= విడుస్తున్నది.

శ్రీరంగనాథుని జంఘలను (పిక్కలను) సేవించిన మాత్రంలోనే **"పునరపి జననం పునరపి మరణం పునరపి జననీజఠరే పతనమ్"** (శయనమ్) (మళ్ళీ పుట్టుక, మళ్ళీ మరణం, మళ్ళీ తిరిగి తల్లిగర్భంలో శయనం) అనే రీతిలోని సంసార కాంతార సంచారం తీరిపోయినది – అనే అభిప్రాయాన్ని తెల్పుతున్నది – ఈ శ్లోకం. **"ఇణైక్కాలిల్ వెళ్ళిత్తళై నిన్ఱిలఙ్గుమ్ కణైక్కాల్ ఇరున్ద వా కాణీరే"** (వెండితో చేసిన దండకడియాలు, పరస్పరం సాటివచ్చే ముంగాళ్లలో అలంకరింపబడగా, అవి ఉండే తీరును చూడండి) అని పెరియాళ్వార్లు అనుసంధించిన తిరువాభరణాల చేరికను భావించి, **"కటకరుచిభి శ్చిత్రాకారామ్"** (అందెల కాంతులతో మనోహరమైన రూపాన్ని కల్గినది) అని అన్నారు. కటక మనేది పాదకటకం (దండ కడియాలు). అది కనకమయమై, నానారత్నాలు మధ్యలో పొదగబడి ఉంటుంది కదా! ఒక్కొక్క రత్నం ఒక్కొక్క రంగులోని కాంతిని కల్గి ఉంటుంది. కనుక, పలు వర్ణాలలోని కాంతులు వ్యాపించినందువల్ల పిక్కలు చిత్రాకారమై ప్రకాశిస్తున్నాయని హార్దభావం.

**(చారువృత్తానుపూర్వామ్)** కుమారసంభవంలో, పార్వతి పిక్కలను వర్ణించే కాళిదాసు **"వృత్తానుపూర్వే చ న చాతిదీర్ఘే జంఘే శుభే"** అని చేసిన ప్రయోగాన్ని మల్లినాథులు **"వృత్తే – వర్తులే, పూర్వమనుగతే అనుపూర్వే, గోపుచ్ఛాకారే – ఇత్యర్థః. వృత్తే చ తే అనుపూర్వే చ వృత్తానుపూర్వే"** అని వ్యాఖ్యానించారు. జంఘలను వర్ణించే సందర్భాలలో– **"వృత్తానుపూర్వే"** (గుండ్రనిది) అని వర్ణించడాన్ని గమనిస్తున్నాము. నక్షత్రమాలికా స్తుతిలోకూడా నమ్మాళ్వార్ల జంఘావర్ణనలో **"నత్వా యామ్... విస్తీర్ణచ్ఛవిశాఖయా**

**శరజితో వృత్తాను పూర్వీజుషా జంఘాకల్పతరుశ్రియా"** అని వర్ణింపబడింది. ఉండ వలసిన రీతిలో ఉన్నది – అనేది ఇక్కడి పరమతాత్పర్యం.

**(కాలే దూత్యద్రుతతరగతిమ్)** – భట్టర్, శ్రీరంగరాజస్తవంలో, శ్రీరంగనాథుని శ్రీపాదవర్ణనలో **"యత్ బృందావనపండితమ్.... యత్ దూత్యప్రసంగోత్సుకమ్"** (బృందావనంలో సంచరించడంలో సమర్థమైనవి, ..... పాండవులకు దూతగా వెళ్ళడంలో ఆసక్తిని కల్గినవి) అని అనుగ్రహించారు. దేశికులుకూడా పాదుకాసహస్రంలో – **"యోషిత్ పూతదృషంతి .... దూత్యాదిష్వపి దుర్వచాని పదయోః కృత్యాని"** (పాండవులకు దూతగా వెళ్ళడంలో కూడా పాదాలయొక్క వాచామగోచరమైన కృత్యాలు) అని అనుగ్రహించారు. నవరత్నమాలై అనే ప్రబంధంలో కూడా మొదటి పాశురంలో **"తరుమనిరన్దదు ఇశైన్దు శెన్దన"** (ధర్మరాజు యాచించిన మాటను అంగీకరించి దూతగా వెళ్ళినవి) అని అన్నారు. ఈ విధంగా శ్రీచరణాల కృత్యంగా చెప్పబడే దూత్యానికి పోయే కృత్యం ఇక్కడ జంఘలకు చెప్పబడడంలో ఏ కొఱత లేదు. పిక్కబలాన్ని కలవారికే నడచి వెళ్ళడం సులభం కనుక, పాదాల కృత్యమైన దీనిని జంఘలకు (పిక్కలకు) ఆరోపించి పల్కడం పొసగే విషయమే. జంఘకూడా పాదదేశమే కదా! దూత్యానికి పోయిన శ్రీకృష్ణుడు, ఆదిశేషపర్యంకంపై శయనించి ఉండే శ్రీరంగనాథుడు ధర్మైక్యంవల్ల అభిన్నవ్యక్తులు – అని చూపడంకోసమే ఈ విశేషణం ప్రయోగింపబడింది. **"మదురైమా నకరన్దన్నుళ్.... కవళ మాల్యానై కొన్ఱ కణ్ణనై అరఙ్గమాలై"** (మధురానగరంలో మదపుటేనుగు అయిన కువలయాపీడాన్ని వధించిన శ్రీరంగనాథుని) అని, **"కోవలనాయ్ వెణ్ణె యుణ్డ వాయన్ అణ్డర్‌కోన్ అణియరఙ్గన్"** (గోపాలుడై వెన్నను ఆరగించిన నోటిని కలవాడు, అండాధిపతి, అందమైన శ్రీరంగం లోని శ్రీరంగనాథుడు) అనే ఈ రీతిలో కదా పలువురు ఆழ்వార్లుకూడా అనుభవించారు.

**(కాంతిలీలాకలాచీమ్)** – **"కలాచీ"** అనేది మూలంలో చిన్నదై, నోటి దగ్గర విశాలంగా ఉంటే ఒక పాత్ర విశేషాన్ని తెలిపే శబ్దం. పడిగమని చెప్పవచ్చు. దివ్యాలైన అవయవాలనుండి ప్రసరించే సౌందర్యప్రవాహాన్ని తనలోపల ధరించగల్గిన ఒక పాత్రవిశేషమా! – అనే రీతిలో ఉన్నదట – శ్రీరంగనాథుని జంఘ (పిక్క). లీలాశబ్దాన్ని కాంతితో అన్వయించకూడదు. **'కలాచీ'** అనే పదంలో అన్వయించాలి. విలాసం కోసం పెట్టుకొనబడే కలాచి – అని భావం. అది కాంతులను ధరించడానికి ఉపయోగపడేది కనుక, **"కాంతిలీలాకలాచీమ్"** అని అనబడింది.

**(జానుచ్ఛాయాద్విగుణసుభగామ్)** – ముంగాళ్ళు, పిక్కలు పరస్పరం చాలా దగ్గరగా ఉండే దివ్యావయాలు కనుక, మోకాళ్ళ అందం, జంఘల అందంతో చేరి రెండింతలైన

అందంతో వర్ధిల్లుతున్నది. **"ద్విగుణం యథా తథా సుభగామ్"** అని వివరించాలి. ఈ విధంగా ఉండే –

**(రంగభర్తుః జంఘాం మదాత్మా దృష్ట్వా జననపదవీజాంఘికత్వం జహాతి)** – శ్రీరంగనాథుని పిక్కలను సేవించిన తరువాత సంసారసరణిలో పరుగుతీయడం అనే మన స్వభావం నిరోధింపబడుతుంది – అని భావం.

**4) కామారామస్థిరకదళికా స్తంభసంభావనీయం**
**క్షౌమాశ్లిష్టం కిమపి కమలాభూమినీళోపధానమ్ ।**
**న్యంచత్కాంచీకిరణరుచిరం నిర్విశత్యూరుయుగ్మం**
**లావణ్యౌఘద్వయమివ మతి ర్మామికా రంగయూనః ॥**

కామ+ఆరామ = మన్మథుని ఉద్యానవనంలోని, స్థిరకదళికాస్తంభ = స్థిరంగా ఉండి పెరిగిన అరటిబోదెయా! ఇది అని, సంభావనీయం = ఉత్ప్రేక్షించదగినది, క్షౌమ+ఆశ్లిష్టం = పీతాంబరాన్ని అలంకరించుకొన్నది, కిమపి = అనిర్వచనీయమైన, కమలాభూమి + నీళా + ఉపధానం = శ్రీదేవి, భూదేవి, నీళాదేవులకు విలక్షణమైన తలగడవంటిది, న్యంచత్ = క్రిందిముఖంగా ప్రకాశించే, కాంచీ = మొలనూలుయొక్క కిరణరుచిరం = కాంతులతో అందమైనది అయిన, రంగయూనః ఊరుయుగ్మం = శ్రీరంగనాథుడనే యువకుని ఊరుద్వంద్వాన్ని, మామికా మతిః = నా చింతన, లావణ్య+ఓఘ+ద్వయమ్ ఇవ = లావణ్య ప్రవాహాలు రెండిటిని వలె, నిర్విశతి = అనుభవిస్తున్నది.

ఇందులో శ్రీరంగనాథుని ఊరుయుగాన్ని అనుభవించి (దర్శించి) పల్కుతున్నారు. **"అడి పరుత్తు నుని శిఱుత్తు మదమదెన్ఱు మాంసలజ్గళాయ్ విళజ్గుమ్"** (ఆరంభంలో లావుగా దృఢంగా ఉన్నవి, చివరలో సన్నగా ఉన్నవి, మిక్కిలి మిసమిసలాడుతూ ఉండేవి) అనబడే ఊరువులను **"కందళితకదళీకాండా"** (అరటిబోదె)లతో పోల్చి వర్ణించడం కవిసమయం. కనుక, **"కదళీస్తంభ సంభావనీయమ్"** అని అనబడింది. ప్రసిద్ధమై, ఉపమానంగా చెప్పబడే వస్తువులను ప్రస్తావించి, ఉపమేయానికి ఇవి సాటి రావు – అని నిషేధించే తీరుకూడా ఉన్నది. శ్రీరంగనాథుని ఊరువులను వర్ణించే భట్టర్, **"రంభాకరభకరీంద్రకరాభిరూప్యదర్పం... పరిభూయ గర్వగుర్వోః"** (రంభయొక్క కరభాన్ని– అంటే–చేతి చిటికెనవేలునుండి మణికట్టువరకు ఉండే భాగాన్ని, గొప్ప ఏనుగుయొక్క తొండాన్ని పరిహసించేవి) అని అన్నారు. కదళీస్తంభాదులను జయించి ప్రకాశించే శ్రీరంగనాథుని ఊరువులకు ఉపమానంగా చెప్పదగిన వస్తువు అనేది లేదు – అని భావం. పార్వతి ఊరువులను వర్ణించే మహాకవి, **"ఏకాంతశైత్యాత్ కదలీవిశేషాః...**

**జాతా స్తదూర్వో రుపమానబాహ్యాః"** (కేవలం చల్లదనాన్ని కల్గి ఉన్నందున అరటి బోదెలు పార్వతి ఊరువులకు సాటిరావు) అని అన్నాడు. అందువల్ల పోల్చడానికి తగనిది అని నిషేధింపబడ్డ కదళీస్తంభాన్ని ఇక్కడ ఉపమానంగా భావించి, **"కదళీస్తంభ సంభావనీయమ్"** (అరటి బోదెలతో పోల్చదగినవి) అని ఏ విధంగా వర్ణిస్తున్నారు? అని సందేహపడనక్కరలేదు. సాటి వస్తుంది-అని, సాటి రాదని ప్రస్తావించడం, నిషేధించే ప్రసక్తియే లేదు - అని అనడం- ఇవి అంతా కవుల గోష్ఠిలో పర్యాయాలు అని చెప్పవచ్చు. కదళీస్తంభంతో సంభావనీయం - అని భావించి, కదళీస్తంభంచేత గౌరవించదగినదిగా ఉన్నది - అనే అర్థం గ్రహించ కూడదని కొందరు అంటారు.

ఈ కదళీస్తంభం ఏ తోటలో పుట్టింది? అని అంటే - **(కామారామ)** - మన్మథోద్యానంలో పుట్టినది - అని అంటున్నారు. దేవేంద్రునకు నందనమనే ఉద్యానవనంవలె, కుబేరునకు చైత్రరథంవలె, మన్మథునకు ఒక ఉద్యానవం ఉన్నదనే ప్రసిద్ధి లేకపోయినా, ఇక్కడ అది కల్పించి చెప్పబడుతున్నది. మన్మథుడు విల్లుగా గ్రహించే చెఱకుగడ, బాణాలుగా చేసికొనే పూలు ఏ తోటలో మొలుస్తున్నాయో, దానిలోనే ఈ కదళీవృక్షం కూడా మొలవడంలో అడ్డు లేదని భావించాలి. **"స్థిరకదళికా"** - గొప్ప గాలికి సైతం చలించకుండా నిలకడగా ఉండే అరటి - అని భావం.

**(క్షౌమాశ్లిష్టమ్)** - పీతాంబరాలంకృతమని భావం. అచేతనవస్తువుకూడా ఆశ్లేషం (ఆలింగనం) చేసికోవాలనే కోరే అందాన్ని కల్గినది - అని హార్దభావం.

**(కమలాభూమినీళోపధానమ్)** - **"ఆవివాహసమయాత్ గృహే వనే శైశవే తదను యౌవనే పునః, స్వాపహేతు రనుపాశ్రితోఽన్యయా రామబాహు రుపధాన మేష తే" (ఉత్తర రామచరితమ్)** (వివాహసమయంనుండి ఇంటిలో, వనంలో, శైశవప్రాయంలో, తర్వాత యవ్వనదశలో వేరెవ్వరిచేత ఆశ్రయింపబడని ఈ శ్రీరాముని బాహువు నీకు తలదిండు) అని భవభూతి పల్కినట్లుగా, "దివ్యదేవేరులకు భగవానుని బాహువే కదా తలదిండు అవుతున్నది, ఇంకొక అవయవం కాదగదు" - అనే నియతి లేదు కదా! శ్రీచరణాలను సంవాహనం చేసే దేవేరులు, తమకు కొంచెం అలసట కలుగగానే ఊరువులపై తమ తలను పెట్టుకొని శయనిస్తారు. కనుక, **"తిరుమకళుమ్ మణ్మకళుమ్ ఆయ్మకళుమ్"** (లక్ష్మీదేవి, భూదేవి, నీళాదేవి) అనే దివ్యపత్నులకు ముగ్గురికి ఉపధానమై ఉన్నవి, శ్రీరంగనాథుని ఊరువులు - అని భావం.

**(న్యంచత్కాంచీకిరణరుచిరమ్)** - **"అరజ్గత్తమ్మాన్ తిరువయి*ఱ్ఱు*దరబందమ్ ఎన్ ఉళ్ళత్తుళ్ నిన్రులాకిన్డదే"** (శ్రీరంగనాథుని నడుమునకు అలంకరించిన ఒడ్డాణం నా

మనస్సులోపల నిలచి నాట్యం చేస్తున్నది) అని తిరుప్పాణ్ ఆ*ళ్వా*ర్లు అనుభవించిన ఉదరబంధమనే దివ్యాభరణంయొక్క కాంతులు అధోముఖంగా ప్రసరించగా, దానివల్ల కల్గిన అందం విజృంభించి వెలుగుతున్నది – అని భావం.

**(లావణ్యౌఘద్వయమివ)** కూరేశులు, వరదరాజస్తవంలో – **"యా తే గాత్రే వరద! జనితా కాంతిమయ్యాపగాఽభూత్ తస్యాః స్రోతోద్వితయ మిహ యద్యాతి పాద ప్రవాదమ్"** (ఓ వరదరాజస్వామీ! నీ దేహంనుండి ఆవిర్భవించిన కాంతిరూపంలోని నది రెండు పాయలుగా చీలి పాదాలుగా రూపొందుతున్నది) అని అనుగ్రహించిన శ్లోకాన్ని అనుసరిస్తూ ఈ విధంగా పల్కుతున్నారు. తిరుమేనిలో భాసించిన లావణ్య ప్రవాహం తిరునాభివరకు ఒకే ప్రవాహంగా ప్రవహించి, దానికింద రెండు భాగాలైనదా! అనేటట్లుగా ఊరుద్వయం ఉన్నది. దీని పరిపూర్ణాను భవం కలిగే రీతిని గూర్చి ఈ విధంగా అనుగ్రహింపబడింది.

**5) సంప్రీణాతి ప్రతికల మసౌ మానసం మే సుజాతా**
**గంభీరత్వాత్క్వచన సమయే గూఢనిక్షిప్తవిశ్వా।**
**నాళీకేన స్ఫురితరజసా వేధసో నిర్మిమాణా**
**రమ్యావర్తద్యుతిసహచరీ రంగనాథస్య నాభిః ॥**

సుజాతా = ఆభిజాత్యాన్ని కల్గినది, గంభీరత్వాత్ = బాగా లోతును కల్గి ఉన్నందున, క్వచన సమయే = (ప్రళయమనే) ఒక సమయ విశేషంలోకూడా, నిక్షిప్తవిశ్వా = సకల భువనాలను తన లోపల అంతర్భవించుకొన్నది, స్ఫురితరజసా = ప్రకాశించిన పుప్పొడిని కల్గిన, నాళీకేన = నాభీకమలంతో, వేధసః నిర్మిమాణా = చతుర్ముఖబ్రహ్మలను సృష్టిస్తున్నది, రమ్య + ఆవర్తద్యుతిసహచరీ = అందమైన నీటి సుడికాంతితో పోలిన కాంతిని కల్గినది అయిన, రంగనాథస్య అసౌ నాభిః = శ్రీరంగనాథుని ఈ తిరునాభి, ప్రతికలం = ప్రతిక్షణం, మే మానసం = నా మనస్సును, సంప్రీణాతి = ఆనందింప జేస్తున్నది.

**"అయనై ప్పడైత్తదు ఓరెళ్ళిల్ ఉన్దిమేలదన్రో అడియేనుళ్ళత్తిన్ ఉయిరే"** (బ్రహ్మను సృష్టించిన, అద్వితీయమైన, ప్రకాశించే శ్రీరంగనాథుని నాభిలో నా ప్రాణం నిలచి యున్నది) అని అంటూ తిరుప్పాణ్ ఆ*ళ్వా*ర్లు అనుభవించిన రీతిలోనే దేశికులు పెరియపెరుమాళ్ తిరునాభిని దర్శించి పల్కుతున్నారు, ఈ శ్లోకంలో.

**(రంగనాథస్య సుభగా నాభిః)** – **"అణియరఙ్గన్"** (అందమైన శ్రీరంగంలోని శ్రీరంగనాథుడు) యొక్క అందమైన తిరునాభి ఏవిధంగా ఉన్నది? అని అంటే,

**(గంభీరత్వాత్ క్వచన సమయే గూఢనిక్షిప్తవిశ్వా)** – **"మణ్ణాడుమ్ విణ్ణాడుమ్ వానవరుమ్ తానవరుమ్ మఱ్ఱుమెల్లామ్ ఉణ్ణాద పెరువెళ్ళ ముణ్ణామల్ తాన్ విழுంగ్గి ఉయ్యక్కొణ్డ"** (భూలోకం, స్వర్గం, దేవతలు, దానవులు ఇంకా మిగిలిన అందఱు ప్రళయ జలంలో మునిగిపోకుండా వానిని అన్నిటిని తాను మింగి రక్షించిన) అనే రీతిలో ప్రళయమనే ఒక కాలవిశేషంలో **"నళిర్‌మది చ్చడైయనుమ్ నాన్ముక క్కడవుళుమ్ తళిరొళి యిమైయవర్ తలైవను ముదలా యావకై యులకముమ్ యావరు మకప్పడ"** (నాభీపద్మంనుండి పుట్టిన బ్రహ్మ, చంద్రశేఖరుడు, జటాధారి అయిన శివుడు, చిగురువంటి కాంతిని కల్గిన ఇంద్రుడు మొదలైన సమస్తలోకం తనలో ఇమిడియుండేటట్లు) తనలో అంతర్భవించుకొన్నది. ఇన్నిటికి తిరునాభిలోని చోటు సరిపోతుందా? అని సందేహించనక్కరలేనట్లుగా **"గంభీరత్వాత్"** అని ప్రయోగింప బడింది.**"తాழ்కుழలార్ వైత్త తయిరుణ్డ పొన్‌వయిఱు ఇవ్వేழులకు ముణ్డు మిడముడైత్తు"** (అందంగా వేలాడే కేశాలను కల గోపికలు తీసిపెట్టిన వెన్నను ఆరగించిన బంగారు బొజ్జ, ఈ ఏడేడు లోకాలను లోపల ఇముడ్చుకొనే వైశాల్యాన్ని కల్గినది) అనే రీతిలోని అందాన్ని కల్గినదని భావం.

ఇంకా శ్రీరంగనాథుని తిరునాభి ఎటువంటిది? అని అంటే–

**(స్ఫురితరజసా నాళీకేన వేధసో నిర్మిమాణా)** – నాళీకమంటే తామరపూవు. **"నాభీ నాళీకరింఖన్మధుకరపటలీ"** (నాభీపద్మంలో ధ్వనించే తుమ్మెదల స్వరూపం) అని తత్త్వముక్తాకలాపమంగళ శ్లోకంలో కూడ ఇటువంటి ప్రయోగం ఉన్నది. **"తన్నాభీ వలయత్తు ప్పేరొళి శేర్ మన్నియ తామరై మామలర్ పూత్తు, అమ్మలర్ మేల్ మున్నమ్ తిశైముకనై త్తాన్ పడైక్క"** (పెరియ తిరుమడల్) (తన నాభిలో గొప్ప కాంతిని కల్గిన, స్థిరంగా నిలచిఉండే పద్మం వికసించగా, ఆ పద్మంలో సృష్టికి ముందు చతుర్ముఖుని తాను సృష్టించగా), **"ఉయ్య ఉలకు పడైక్కవేణ్డి ఉన్దియిల్ తోన్డినాయ్ నాన్ముకనై"** (లోకాలను సృష్టించదలచిన నీవు నాభీపద్మంలో చతుర్ముఖుని సృష్టించావు.) అని పలికే రీతిలో తిరునాభి తనలో పుట్టిన తామరపూవుతో లెక్కలేనంత మంది చతుర్ముఖబ్రహ్మలను ఉత్పత్తి చేస్తున్నది. **"స్ఫురితరజసా"** అని అంటూ తామర పూవుకు ప్రయోగించిన విశేషణంచేత అది వికసించినదని తెలుపబడింది. వికాసదశలోకదా రజస్సుకు స్ఫురణ కల్గుతుంది. (పుప్పొడి బాగా కన్పిస్తుంది). రజస్సు అంటే పూవులో ఉండే చిన్ని చిన్ని కణాలు. ఇంకా ఎటువంటిది శ్రీరంగనాథుని తిరునాభి? అని అంటే –

**(రమ్యావర్తద్యుతిసహచరీ)** – ప్రవాహం అధికమైన చోట నీటిబుడగ ఏర్పడడం సహజం. అదే రీతిలో పెరియపెరుమాళ్ యొక్క దివ్యావయవాలలో సౌందర్యలావణ్య

ప్రవాహపుంజం అధికం కాగానే, నాభి అనే వ్యాజంతో సుడి ఏర్పడినదా! ఏమి! అని సంభావించేటట్లున్నది. **"సహచరీ"** అనే దానికి **"సదృశీ"** అని అర్థం. అందువల్ల, ఇటువంటి శ్రీరంగనాథుని తిరునాభి తమ మనస్సుకు భోగ్యమై ఉండే రీతిని గూర్చి శ్రీదేశికులు తెలిపినట్లయింది. **"ప్రతికలమ్"** అనేపదానికి ప్రతిక్షణమని అర్థం. **"కలా, కాష్ఠా"** ఇత్యాదిపదాలు చాలా అల్పమైన కాలపరిమితిని తెలిపే పదాలు.

ఈ శ్లోకంలోని పదప్రయోగాలను బాగా నిశితంగా పరిశీలించి చూచినపుడు, సమాసోక్త్యలంకార రీతిలో అప్రస్తుతమైన ఒక కులస్త్రీ వృత్తాంతంకూడా భాసిస్తున్నది. ఇక్కడ **"సుజాతా"** అని కులకాంత నిర్దేశింపబడింది.

**(గంభీరత్వాత్ ఇత్యాది)** – గంభీరస్వభావంచేత గృహచ్ఛిద్రం (ఇంటిలోని సమస్యలు) మొదలైనవానిని దేనినీ వ్యక్తం చేయకుండా, తన మనస్సులోనే మఱుగుపరచుకొని ఉండేది – అని తెలుపబడింది. ఆమె కన్నియ పరువం దాటిన తరువాత, వేదాధ్యయనాదులలో బ్రహ్మతో సాటి వచ్చే సత్పుత్రులను ప్రసవించే రీతి మూడవ పాదంతో తెలుపబడుతున్నది. ఆழ்వార్లు దివ్యదేశాలను వర్ణించేటపుడు – **"తిశైముకననైయోర్ నాన్గై నన్నడువుళ్"** అని, **"తిశైముకనై యనైయవర్కళ్ అణియழுన్దూర్"** (బ్రహ్మతో సమానమైనవారు నివసించే అందమైన తిరువழுన్దూర్ దివ్యక్షేత్రం) అని, **"వణ్శివనుమ్ అయనుమ్ తానుమొప్పార్ వాழ்..... తిరుచ్చిఱ్ఱాఱు"** (గొప్పవాడైన శివునితో, బ్రహ్మతో సాటి వచ్చేవారు నిత్యవాసం చేసే తిరుచ్చిఱ్ఱాఱు అనే దివ్యదేశం) అని– అనుగ్రహించారు. ఈవిధంగా, **"వేధసః"** అనే పదానికి బ్రహ్మవంటి సత్పుత్రులను – అని భావం.

**6) శ్రీవత్సేన ప్రథితవిభవం శ్రీపదన్యాసధన్యం**
**మధ్యం బాహ్వో ర్మణివరరుచా రంజితం రంగధామ్నః ।**
**సాంద్రచ్ఛాయం తరుణతులసీచిత్రయా వైజయంత్యా**
**సంతాపం మే శమయతి ధియ శ్చంద్రికోదారహారమ్ ॥**

శ్రీవత్సేన = శ్రీవత్సం అనే పుట్టుమచ్చతో, ప్రథితవిభవం = ప్రచారం చేయబడిన ఐశ్వర్యాన్ని కల్గినది, శ్రీపదన్యాసధన్యం = లక్ష్మీదేవి తన పాదాలను (మోపడం) చేత పవిత్రమైనది, మణివర = కౌస్తుభమనే **"కురుమామణి"** (చాలా గొప్పమణి) యొక్క రుచి = కాంతిచే, రంజితం = అందాన్ని పొందింపబడినది, (ఎఱ్ఱని రంగును కల్గినదిగా చేయబడినది), తరుణతులసీ = ముదిరిన తులసీమాలతో (కూడి ఉండడంచేత),

చిత్రయా = చిత్ర వర్ణాన్ని కల్గిన, వైజయంత్యా = వనమాలచేత, సాంద్రచ్ఛాయం = దట్టమైన కాంతిని కల్గినది, చంద్రికా + ఉదారహారం = వెన్నెలవలె అందమైన ముత్యాల హారాలను కల్గినది అయిన, రంగధామ్నః = శ్రీరంగనాథునియొక్క, బాహ్వోః మధ్యం = వక్షఃస్థలం, మే ధియః = నా బుద్ధియొక్క, సంతాపం = తాపాన్ని, శమయతి= తీరుస్తున్నది.

శ్రీరంగనాథుని వక్షఃస్థలసౌందర్యంలో అభినివేశాన్ని పొంది అనుగ్రహింపబడిన శ్లోకం ఇది. **"అకలకిల్లేన్ ఇఱైయు మెన్ఱు అలర్‌మేల్ మఙ్గైయుఱై"** (క్షణంకూడా విడచి ఉండలేను – అని పద్మావతి నిత్యవాసం చేసే) వక్షఃస్థలం కనుక, గుణలేశం కూడా లేకుండా దోషమే మూర్తీభవించినవారమైన మనపట్ల దయ చూపి, మాతృత్వప్రయుక్తమైన వాత్సల్యాతిశయంతో పురుషకారాన్ని చేసి, భగవానునివద్దకు చేర్పించగల్గిన లక్ష్మీదేవి క్షణమైనా విశ్లేషించకుండా నిత్యవాసం చేసే చోటుకదా ఇది! – అని అనుసంధించగానే సకలతాపాలు తీరేటట్లు ఉంటుందనే విషయాన్ని స్వానుభవం ద్వారా శ్రీదేశికులు అనుగ్రహిస్తున్నారు. వక్షఃస్థలసౌందర్యాన్ని అయిదు విశేషణాలతో తెల్పుతున్నారు.

**(శ్రీవత్సేన ప్రథితవిభవమ్)** – శ్రీవత్సాంకుడని, తిరుమఱుమార్భన్ – అని గొప్పగా కీర్తింపబడే భగవానునకు ఆ శ్రీవత్సం వక్షఃస్థలంలో ప్రకాశిస్తుంది. భగవానునకు గల ఐశ్వర్యానికి అంతటికి అదియే నిదానమై ఉన్నదని అంటున్నారు. **"శ్రీవత్సమ్"** అనేది వక్షఃస్థలంలోని శ్వేత రోమాల సుడి. లోకంలోకూడా కొందరికి మచ్చ ఉండడాన్ని చూచి, "దీనివల్లనే ఇతనికి ఇంతటి ఐశ్వర్యం" అని అంటారుకదా! ఇక్కడకూడా ఆ విధంగా పల్కబడింది.

**(శ్రీపదన్యాసధన్యమ్)** – 'లక్ష్మీదేవి వేంచేసి ఉన్నందువల్ల ధన్యమైనది' – అని అనకుండా, 'ఆమె పాదవిన్యాసాలవల్ల ధన్యమైనది' – అని అనడం – **"వేదాంతా స్తత్త్వ చింతా మురభిదురసి యత్పాదచిహ్నై స్తరంతి"** (శ్రీగుణరత్నకోశం) (వేదాంతాలు తాము చేసే పరతత్త్వ విచారణను, మురారి వక్షస్థలంలోని ఏ లక్ష్మీదేవి పాదచిహ్నాలను చూచి అతడే పరతత్త్వమని నిర్ణయిస్తున్నాయో) అనే భట్టర్ దివ్యసూక్తిని మనస్సులో ఉంచుకొని. "ఏ దైవం పరదైవమో?" అనే విచికిత్స వేదాంతాలకు ఏర్పడి, ఒక్కొక్క దైవాన్ని పరిశీలించి చూచినపుడు, శ్రీమన్నారాయణుని వక్షస్సులో లక్ష్మీపదలాక్షా లక్షణాన్ని (లక్ష్మీదేవి పాదాల పారాణి ముద్రలను) చూచి, 'ఇతడే దేవాధిదేవుడు' అని అవి నిశ్చయించాయి – అనేది ఉదాహరింపబడ్డ భట్టర్ శ్రీసూక్తియొక్క భావం. అందువల్ల, భగవానుని వక్షఃస్థలానికి లక్ష్మీదేవి వేంచేసి ఉండడం మాత్రమే గౌరవం కాదు; ఆమె శ్రీపదసంబంధాన్ని కల్గి ఉండడంకూడా విలక్షణమైన అతిశయం – అని భావం.

**(మణివరరుచా రంజితమ్) – "కురుమామణిప్పూణ్ కులావి త్తికళుమ్"** (గొప్ప రత్నమైన కౌస్తుభమణి గొప్పగా ప్రకాశించే) వక్షఃస్థలం అని అంటూ పెరియాళ్వార్లు అనుగ్రహించినట్లే శ్రీకౌస్తుభంయొక్క కాంతిచేత అతిశయితమైన శోభను కల్గినది అయినది. సహజమైన నీలవర్ణంతో ఎఱ్ఱని వర్ణాన్ని కల శ్రీకౌస్తుభంయొక్క కాంతి కల్గి ఉన్నందువల్ల వక్షస్సుకు ఏర్పడిన వైలక్షణ్యం (పరభాగ శోభ) ఇక్కడ తెలుపబడింది.

**(తరుణతులసీచిత్రయా వైజయంత్యా సాంద్రచ్ఛాయమ్) "తోళిణైమేలుమ్ నన్మార్పిన్ మేలుమ్ శుడర్ముడిమేలుమ్ తాళిణైమేలుమ్ పునైన్ద తణ్ణన్తుళాయ్"** (బాహువులలో, వక్షస్సులో, ప్రకాశించే కిరీటంపై, పాదాలపై అలంకరింపబడిన, అందమైన చల్లని తులసి) యొక్క శోభ, వనమాలయొక్క శోభ కలసి విచిత్రమైన వర్ణాన్ని కల్గినదైనది – శ్రీరంగనాథుని వక్షఃస్థలం.

**(చంద్రికోదారహారమ్) – "సంతాపం మే శమయతి"** (నా తాపాన్ని తీరిస్తున్నది) అనే ప్రయోగానికి తగినట్లుగా **"సాంద్రచ్ఛాయమ్"** అని, **"చంద్రికోదార"**మని పల్కడం చాలా అందం. సాంద్రచ్ఛాయను, చంద్రికను చూడగానే సంతాపం తీరడాన్ని గూర్చి అడగాలా! **"శమయతు"** అనే పాఠం నవీనం.

**7) ఏకం లీలోపహిత మితరం బాహు మాజానులంబం**
**ప్రాప్తా రంగేశయితు రఖిలప్రార్థనాపారిజాతమ్ ।**
**దృప్తా సేయం దృఢనియమితా రశ్మిభి ర్భూషణానాం**
**చింతాహస్తిన్యనుభవతి మే చిత్ర మాలానయంత్రమ్ ॥**

రంగేశయితుః = శ్రీరంగనాథుని, అఖిలప్రార్థనాపారిజాతమ్ = కోరినవారి అందఱి కోరికలను తీర్చడంలో కల్పవృక్షంవంటిదై, లీలా+ఉపహితం = విలాసంకోసం తలదిండుగా చేసికోబడినది అయిన, ఏకం బాహుం = ఒక కుడి బాహువును, ఆజాను లంబమ్ ఇతరం బాహుం = మోకాలువరకు చాచిన వేఱొక ఎడమ చేతిని, ప్రాప్తా = కల్గి ఉన్నదై, దృప్తా = దర్పాన్ని పొందిన, మే = నాయొక్క, సేయం = ఈ, చింతా హస్తినీ = చింతన (ధ్యానం) అనే ఆడ ఏనుగు, భూషణానాం రశ్మిభిః = దివ్యభూషణాల కాంతి అనే దారాలతో, దృఢనియమితా (సతీ) = బిగువుగా బంధింపబడినదై, ఆలాన యంత్రం= కట్టుస్తంభానికి బంధింపబడి ఉండే స్థితిని, అనుభవతి = అనుభవిస్తున్నది, చిత్రం = ఆశ్చర్యం!

శ్రీరంగనాథుని రెండు బాహువుల సౌందర్యంలో తాము మునిగినవారై, బంధింప బడ్డ రీతిని ఒక విధమైన చమత్కారం భాసించేటట్లుగా ఇందులో దేశికులు అనుగ్రహిస్తున్నారు. **"అఖిలప్రార్థనాపారిజాతమ్"** (అన్ని ప్రార్థనలను అనుగ్రహించే పారిజాతంవంటి వాడు) అనే విశేషణం కుడి ఎడమలలో ఉంటే రెండు బాహువుల లోను అన్వయిస్తుంది. **"అలమ్ పురిన్ద నెడుమ్ తడక్కై"** (తిరునెడున్దాణ్డకమ్) (ఇక చాలు– అనే రీతిలో కోరికలను సమృద్ధిగా ఇచ్చే ఉదారమైన చేతిని కలవాడు) అనే రీతిలో "ఇక చాలు చాలు" అని పలికేటట్లుగా కదా స్వామి బాహువులు అడిగినవారి కోరికలను నిండుగా తీరుస్తాయి. **"అఖిలప్రార్థనా"** అనే ప్రయోగాన్ని సమానాధికరణం గాను (బహుప్రీహి), వ్యధికరణంగాను (తత్పురుషగా) గ్రహించవచ్చు. అన్నివిధాలైన ప్రార్థనలు – అని గ్రహిస్తే సమానాధికరంగా చెప్పినట్లు, అందటి ప్రార్థనలను – అని గ్రహిస్తే వ్యధికరణంగా చెప్పినట్లు కాగలదు. రెండు రీతులలోను తాత్పర్యం ఒకటే. **"అర్థితార్థపరిదానదీక్షితాలు"** (అడిగినవారి కోర్కెలను అన్నిటినీ ఇవ్వడం అనే వ్రతాన్ని కల్గినవి) కదా స్వామి బాహువులు.

రెండు బాహువులలో, ఒక బాహువు తలదిండుగా చేసికోబడి, రెండవ బాహువు మోకాలువరకు చాచబడి ఉండే రీతిని యథావస్థితంగా మొదటి పాదంలో అనుభ విస్తున్నారు. భట్టర్ శ్రీరంగరాజస్తవంలో **"కిరీటం రంగేశయితు రుపధానీకృతభుజో విధీశాధీశత్వాత్ ఘటత ఇతి సంస్పృశ్య వదతి, నిహీనానాం ముఖ్యం శరణమితి బాహు స్తదితరః స్ఫుటం బ్రూతే పాదాంబుజయుగళ మాజానునిహితః"** (తలదిండుగా చేసికొన బడిన శ్రీరంగనాథుని ఒక భుజం కిరీటాన్ని తాకుతూ, 'నేను, బ్రహ్మరుద్రులకు ప్రభువును, కనుక ఈ కిరీటం నాకు తగినది' – అని తెల్పుతున్నది. ఇంకొక బాహువు, మోకాలి వైపు దీర్ఘంగా చాచబడినదై, శ్రీపాదాలను చూపిస్తూ, 'ఈ పాదాలే ఏదిక్కు లేని వారికి గొప్ప రక్షకం'– అని తెల్పుతున్నది.) అని అనుగ్ర హించిన శ్లోకం ఇక్కడ అనుసంధేయం. దీని అర్థం కొంచెం వివరింపబడుతున్నది.**"అంగై రంతర్నిహితవచనై స్సూచిత స్సమ్యగర్థః"** (భావాలను లోపల ఇముడ్చుకొన్న అవయవాలచే అర్థం సూచింపబడినది) అనే రీతిలో మౌనవ్రతాన్ని గ్రహించిన వారుకూడా అంగవిన్యాస విశేషమాత్రంతో అభిప్రాయ సూచనం చేస్తారు. కదా! అదే రీతిలో పెరియపెరుమాళ్‌యొక్క రెండు బాహువులు మూగవై, చేష్టలతోనే చెప్పదలచిన అంశాన్ని వ్యక్తం చేస్తున్నవట. ఏవిధంగా అంటే – తలదిండుగా చేసికోబడిన ఒక బాహువు, కిరీటాన్ని స్పృశిస్తూ ఉండడంద్వారా "బ్రహ్మరుద్రులకు ప్రభువైన నాకే (శ్రీరంగనాథునకు ఒక్కనికే) ఈ కిరీటం తగినది –

అని తెల్పుతున్నట్లున్నది. మోకాలు వరకు చాచబడి ఉంచిన ఇంకొక బాహువు, పాదాలను తాకుతూ ఉండే స్థితిద్వారా "ఈ శ్రీచరణాలే నిహీనులకు గొప్ప రక్షకం" అని తెల్పుతున్నట్లున్నది. ఒక బాహువు పరత్వాన్ని ప్రకటిస్తున్నట్లు, ఇంకొక బాహువు సౌలభ్యాన్ని వ్యక్తం చేస్తున్నట్లు ఉన్నవి – అని భావం.

**(ప్రాప్తా దృప్తా సేయం మే చింతాహస్తినీ)** – లోకంలో పెద్ద చేతిని (కలవానిని) ఆశ్రయించిన వారికి గర్వం కల్గడం సహజంకదా! "తమ చింతన శ్రీరంగనాథుని రెండు బాహువులను ఆశ్రయించుకొని ఉన్నందువల్ల గర్వాన్ని పొందింది. "మహాపురుష హస్తావలంబాన్ని పొందిన వారికి ఏమి లోటు?" అని భావించడమే ఈ గర్వం. గర్వాన్ని కల్గినవారు వేఱొకరి చేతికి అందకుండా త్రుళ్ళి త్రుళ్ళి సంచరిస్తారు కదా! ఆ విధంగానే శ్రీరంగనాథుని హస్తావలంబబలంవల్ల గర్వాన్ని పొందిన తమ మనస్సు తుళ్ళి యథేచ్ఛంగా (మదపుటేనుగువలె) తిరగడం ఆరంభించగానే, ఆ విధంగా సంచరించ కుండా కట్టుబడి పోయినదట. ఆ విధంగా దానిని గట్టిగా బంధించిన సాధనం ఏది? అని అంటే.

**(భూషణానాం రశ్మిభిః)** – **"రశ్మి"** అనే పదం కిరణానికి, దారానికి పేరు. దారాల వంటి కిరణాలతో – అనే శ్లిష్టరూపాన్ని గ్రహించాలి. తమ చింతన, శ్రీరంగనాథుని ఆభరణాల కాంతితో దిగ్భ్రమను పొంది, తికమకపడి నిలచినది – అని భావం. ఈ చమత్కారోక్తికి అనుగుణంగానే **"చింతాహస్తిని"** అని అంటూ తమయొక్క చింతనను ఒక ఆడ ఏనుగుగా రూపించి పలికారు, శ్రీదేశికులు.

**8) సాభిప్రాయస్మితవికసితం చారుబింబాధరోష్ఠం**
**దుఃఖాపాయప్రణయిని జనే దూరదత్తాభిముఖ్యమ్ ।**
**కాన్తం వక్త్రం కనకతిలకాలంకృతం రంగభర్తుః**
**స్వాంతే గాఢం మమ విలగతి స్వాగతోదారనేత్రమ్ ॥**

సాభిప్రాయస్మితవికసితం = అభిప్రాయంతోకూడిన చిఱునవ్వుతో ఉల్లసితమైనది, చారుబింబ + అధర + ఓష్ఠం = అందమైన దొండపండువంటి కింది పెదవిని, పై పెదవిని కల్గిననది, దుఃఖ + అపాయ ప్రణయిని జనే = దుఃఖాలను తీర్చుకోవాలనే కోరికను కల జనుల విషయంలో, దూరదత్త + ఆభిముఖ్యం = చాలా దూరంలో నుండే ఆభిముఖ్యాన్ని సూచించేది, కనకతిలక + అలంకృతమ్ = సువర్ణ తిలకంచేత అలంకరింపబడినది, కాంతం = మనోహరమైనది, స్వాగత + ఉదారనేత్రం = స్వాగతాన్ని తెలిపే గంభీరమైన నేత్రాలను కల్గినది అయిన, రంగభర్తుః వక్త్రం =

శ్రీరంగనాథుని ముఖమండలం, మమ స్వాంతే = నా మనస్సు లోపల, గాఢం విలగతి= లోతుగా నాటుకొన్నది.

శ్రీరంగనాథుని స్మితవికాసం, అధరోష్ఠాలు, తిలకం, తిరునేత్రాలు – అనే వీటిని ప్రత్యేక ప్రత్యేకంగా అనుభవించి, ఒక్కొక్కదానికి ఒక్కొక్క శ్లోకాన్ని అనుగ్రహించదగి ఉన్నా, సంక్షేపరుచితో వీటిని అన్నిటిని తిరుముఖమండలమనే ఒక అవయవంలో చేర్చి, ఒకే శ్లోకంతో దేశికులు స్తుతిస్తున్నారు. **"వాక్కుమ్ నయనముమ్ వాయుమ్ ముఱువలుమ్ మూక్కు మిరున్దవా కాణీరే"** (వాక్కు నేత్రాలు, నోరు, చిఱునవ్వు, ముక్కు ఉండే తీరును చూడండి) అని పలికే రీతిలోని పలు సూక్తులున్నాయి కదా, ఈ క్రమంలో **"అభిమతజనదర్శనానన్దవేగత్తాలే అర్చావతారసమాధియై క్కడన్దు విమ్మి వెళి విḻుకిన్ద అవ్యక్తమధురమందహాస"** (తన భక్తజనాన్ని చూచినందు కల్గిన గొప్పదైన ఆనందం చేత అర్చావతార నియమాన్ని దాటి, బయటకు వెలువడే అవ్యక్తమైన, మధురమైన చిఱునవ్వును) వికాసాన్ని మొదటి విశేషణంద్వారా అనుభవించారు. లోపల ఉండే అభిప్రాయం అంతా చిఱునవ్వులోనే భాసించడంవల్ల **"సాభిప్రాయ"** అని అనబడింది. **"వాలియదోర్ కనికొల్? వినైయాట్టియేన్ వల్వినైకొల్? కోలమ్ తిరళ్ పవళ కొḻున్దుణ్డమ్కొలో! అఱియేన్, నీలనెడుముకిల్పోల్ తిరుమేని యమ్మాన్ తొణ్డైవాయ్"** (విలక్షణమైన ఒక ఫలమా? లేక, పాపిష్ఠిదాననైన నా పాపమా? లేక, అందం ప్రోగుపడిన పగడపు తునకా? తెలియలేకున్నాను. నల్లని గొప్ప మేఘం వంటి తిరుమేనును కల స్వామియొక్క దొండపండువంటి అధరాన్ని చూస్తే, ఇది నా తీయని ప్రాణాన్ని తీయడం కోసం వచ్చినట్లుగా తోస్తున్నది) అనే రీతిలోని శ్రీరంగనాథుని అధరోష్ఠాలున్న సన్నివేశాన్ని **"చారుబింబాధరోష్ఠమ్"** అని అనుభవింపబడింది. **"చారు"** అనే పదాన్ని వ్యస్తంగా చేసి, ముఖానికి విశేషణంగా అన్వయించినవారుకూడా ఉన్నారు. అయితే, అది వక్తృ వివక్షితం కాదు.

**(దూరదత్తాభిముఖ్యమ్)** – తనను చూడాలని వచ్చేవారికి దర్శనాన్ని అనుగ్రహించ కుండా, **"నిద్రాతి, స్నాతి, భుంక్తే, చలతి, కచభరం శోషయతి, అంతరాస్తే, దీవ్యత్యక్షైః న చాయం కథితు మవసరో భూయ ఆయాహి యాహి"** (నిద్రిస్తున్నాడు, స్నానం చేస్తున్నాడు, భుజిస్తున్నాడు, బయటకుపోతున్నాడు, జుట్టుని ఆరబెట్టుకున్నాడు, లోపల ఉన్నాడు, జూదం ఆడుతున్నాడు, ఇది మాట్లాడే సమయం కాదు, మళ్లీ రా, పో) అని పల్కి పలుమార్లు తరిమివేయడం కోసం వాకిలిలో ఒక వ్యక్తిని నియమించే దుష్టప్రభువు వలె కాకుండా, ఆర్తితో దరిచేరే భక్తులను చాలా దూరంనుండే చల్లగా కటాక్షించి

ఉత్సాహపఱచేటట్లున్నది. **"అణ్ణా! అడియేనిడరై కళైయాయే"** (స్వామీ! దాసుని దుఃఖాన్ని పోగొట్టు) అని, **"నెడియాయ్! అడియేనిడర్ నీక్కే"** (సర్వాధికా! దాసుని ఆర్తిని తీర్చు) అని పల్కుతూ తమ క్లేశాలనుగూర్చి తెలుపాలనే కోరికను కల్గిన భక్తుల విషయంలో ఈ విధంగా ఉంటుంది. **"జనే"** అని అన్నందువల్ల 'ఇటువంటివారు, వీరు' – అనే తేడాను గమనించకుండా, అందఱిపట్ల దయచూపడం తెలుపబడింది.

**(కనకతిలకాలంకృతమ్)** – కస్తూరీతిలకంవలె కనకతిలకంకూడా సమయభేదంతో స్వామికి ఉంటుంది.

**(స్వాగతోదారనేత్రమ్)** – **"కరియ వాకి పుదై పరన్దు మిళిర్న్దు శెవ్వరియోడు నీణ్డ అప్పెరియవాయ కణ్కళ్"** (నల్లనివై, వ్యాపించి, మెరసి, ఎఱ్ఱని రేఖలతో కూడినవై విశాలమైన శ్రీరంగనాథుని పెద్ద నేత్రాలు) భక్తులను "రండి! ఇక్కడకు రండి!!" అని ప్రేమతో స్వాగతి స్తున్నట్లుగా ఉన్నవి – అని భావం.

**9)** **మాల్యైరంతఃస్థిరపరిమళైః వల్లభాస్పర్శమాన్యైః**
**కుప్యచ్చోలీవచనకుటిలైః కుంతలైః శ్లిష్టమూలే ।**
**రత్నాపీడద్యుతిశబలితే రంగభర్తుః కిరీటే**
**రాజన్వత్యః స్థితి మధిగతా వృత్తయ శ్చేతసో మే ॥**

అంతః మాల్యైః = లోపల అలంకరింపబడిన పూమాలికలచేత, స్థిరపరిమళైః= స్థిరమైన, నిలకడగా నిలచి ఉండే పరిమళాన్ని కల్గినవి, వల్లభాస్పర్శమాన్యైః = వల్లభ అయిన దేవేరియొక్క కరస్పర్శవల్ల అతిశయాన్ని పొందినవి, కుప్యచ్చోలీవచన కుటిలైః= కోపాన్ని పొందిన చోళదేశపు స్త్రీల వచనాలవలె కౌటిల్యాన్ని కల్గినవి అయిన, కుంతలైః = కేశపాశంతో, శ్లిష్టమూలే = సంబంధాన్ని పొందిన మూలప్రదేశాన్ని కల్గిన, రత్న + ఆపీడద్యుతిశబలితే = నవరత్నాలు పొదిగిన శిరఃపట్టంయొక్క కాంతులతో నానావర్ణాలను కల్గినదిగా చేయబడిన, రంగభర్తుః కిరీటే = శ్రీరంగనాథుని కిరీటంలో, మే = నాయొక్క, చేతసః వృత్తయః = మనోవ్యాపారాలు, స్థితిమ్ అధిగతాః = స్థైర్యాన్ని పొందినవై, రాజన్వత్యః (అభూవన్) = సక్రమంగా నియమింపబడినవి అయినవి.

తమ చిత్తవృత్తి శ్రీరంగనాథుని కిరీటంలో ఊనికను కల్గినదై, ఇంతవరకు ఉండే **"నిన్ఱవా నిల్లా"** అనే స్థితి తీరిన రీతినిగూర్చి ఇందులో దేశికులు పల్కుతున్నారు. కిరీటానికి రెండు విశేషణాలు ప్రయోగిస్తున్నారు – **"కుంతలైః శ్లిష్టమూలే"** అని, **"రత్నాపీడద్యుతి శబలితే"** అని అంటూ. మొదటి విశేషణంలో అంతర్భవించిన పదమైన

కుంతలాలకు మూడు విశేషణాలు ఉన్నాయి. **"మాల్యైః"** అనేది స్వయంవిశేష్యం. ఇక్కడ హేతౌ పంచమి – అని గ్రహించాలి. స్థిరపరిమళాన్ని కల్గి ఉండడానికి ఇది హేతువు. **"శుదర్‌ముడి మేలుమ్ పునైన్ద తణ్ణన్తుழாయ్‌ముడి యమ్మాన్"** (ప్రకాశించే కిరీటంపైన అలంకరింపబడిన అందమైన చల్లని తులసిని కల స్వామి) అనే రీతిలో కిరీటంపైన పరిమళం అతిశయించిన మాలికలను అలంకరించుకొన్నందువల్ల కేశపాశంలోపల దివ్యపరిమళం ఏనాడూ విచ్ఛేదం లేకుండా ఉన్నది. **"కళిమలర్ త్తుழாయలఙ్గల్ కముழ்ముడియన్"** (సుగంధాన్ని కల తులసీమాలిక పరిమళించే కిరీటాన్ని కలవాడు – అనే తిరువాయ్‌మొழி సూక్త్యనుసంధానం ఇక్కడ వ్యక్తమైనది.

**(వల్లభాస్పర్శమాన్యైః)** – **"కూన్దల్ మలర్‌మఙ్గైక్కుమ్ మణ్‌మడన్దైక్కుమ్ కులవాయర్ కొழுన్దుక్కుమ్ కేళ్వన్"** (గొప్ప కేశాలను కల శ్రీదేవికి, భూదేవి, కులానికి తగిన నీళాదేవికి వల్లభుదు) కనుక ఆ శ్రీదేవి, భూదేవి, నీళాదేవులు కేశాలను దువ్వి ముడివేసే పనిలో నిమగ్నమై ఉండడాన్ని అనుసంధించి, వారి కరస్పర్శతో అతిశయాన్ని పొందిన రీతిని గూర్చి దేశికులు పలికారు. **"వల్లభా"** శబ్దంచేత ఆణ్డాళ్‌ను వివక్షించి, ఆమె ముడుచుకొని తీసి ఇచ్చిన మాలికలను అలంకరించుకొన్నందువల్ల గొప్పతనాన్ని పొందింది – అని కొందఱు అంటారు. ఇది చాలా రస్యమైన అర్థమే అయినా, వక్తకు ఇది వివక్షితం – అని చెప్పడానికి తగిన శబ్దసన్నివేశం ఇక్కడ లేదు. బలాత్కరించి ఈ విధంగా అర్థం చెప్పాలంటే చెప్పాలి. నిరుపపదమైన స్పర్శశబ్దం కరస్పర్శనే సహజంగా చెప్పదగినది.

**(కుప్యచ్చోళీ వచనకుటిలైః)** – ఉత్తమకేశపాశానికి కౌటిల్యం (గుండ్రంగా ఉండడం) ఉత్కర్షంగా చెప్పబడుతున్నది కదా! వంకర తిరిగి గుండ్రంగా ఉండడమే కౌటిల్యం. దీనికి ఏతత్ సమానాకారమైన ఒక మూర్తపదార్థాన్ని ఉపమానంగా పలుక కుండా, **"కుప్యచ్చోళీవచన కుటిలైః"** (కోపించే చోళకాంత వచనాలవలె కుటిలమైనవి) అని ఈరీతిలో విలక్షణంగా పల్కడం చాలా రస్యం. కేశాలలో ఉండే కౌటిల్యం కంటితో దర్శించడానికి వీలుగా ఉంటుంది. మాటలలోని కౌటిల్యం ఆ విధంగా కంటితో దర్శించదగినది కాదు. అందువల్ల కుంతలనిష్ఠ కౌటిల్యానికి కుప్యచ్చోళీవచననిష్ఠ కౌటిల్యాన్ని దృష్టాంతంగా పల్కడం కేవలం శబ్దమాత్రంగానే అని గ్రహించాలి. కుప్యచ్చోళీ వచనం కుటిలం, శ్రీరంగనాథుని కేశపాశంకూడా కుటిలం – అని ఈ విధంగా శబ్దతః పల్కడంలో లోటు లేదు – అని గ్రహించాలి.

ఇక్కడ కర్ణపరంపరగా వినబడే ఒక ఐతిహ్యమున్నది. అది ఏమంటే – శ్రీదేశికులు మొట్టమొదటగా శ్రీరంగ దివ్యాలయానికి వేంచేసినపుడు, అక్కడ తమకు పరిచితులైనవారెవ్వరూ లేనందువల్ల ఒక ఇంటిలోకి ప్రవేశించి, "ఇక్కడ నా వస్తువులను పెట్టి కావేరీనదికి పోయి వస్తాను. కొంచెం నాకు అవకాశం ఇస్తారా?" అని ప్రశ్నించగా, ఆ ఇంటిలో ఉండే గృహిణి స్వామి ప్రభావాన్ని తెలియనందువల్ల, **"న విషేణ న శస్త్రేణ నాగ్నినా న చ మృత్యునా, అప్రతీకార పారుష్యాః స్త్రీభిరేవ స్త్రియః కృతాః"** (విషంతోకాని, ఆయుధంతో కాని, అగ్నితో కాని, చివరకు మృత్యువుతోకాని స్త్రీల కాఠిన్యాన్ని పోగొట్టడం సాధ్యంకాదు. స్త్రీలకు స్త్రీలే సరి.) అని చెప్పబడే రీతిలోని స్త్రీ సహజకౌటిల్యంచేత కఠినంగా కొన్ని మాటలను పల్కగా, వెంటనే స్వామి దేశికులు ఆ చోటును విడచి వెళ్ళిపోయారు. ఆ స్త్రీవచనకౌటిల్యం తమ మనస్సులో నాటుకొన్నందువల్ల, అది ఈ శ్లోకంలోని ఈ సందర్భంలో స్మరణకువచ్చి ఈ విధంగా ప్రస్తావింపబడింది. **"చోళీ"** అంటే – చోళదేశంలోని స్త్రీ, ఈ విధంగా ఇటువంటి కేశపాశంపై అలంకరించబడిన కిరీటం – అనే అర్థంలో **"కుంతలైః శ్లిష్టమూలే"** అని ప్రయోగింప బడింది. శ్రీరంగనాథుని కిరీటం ఇంకా ఏవిధంగా ఉన్నది? అని అంటే,

**(రత్నాపీడద్యుతిశబలితే)** – కిరీటంపై అలంకరింపబడ్డ రత్నమయమైన ఒక శిఖాభరణానికి రత్న పీడమని పేరు. దానినుండి వ్యాపించిన నానావర్ణాలలోని కిరణాలతో శబలితమై – చిత్రవర్ణంతో కూడుకొన్నదై ఉన్నది – కిరీటం. ఇటువంటిది అయిన

**(రంగభర్తుః కిరీటే)** – శ్రీరంగనాథుని కిరీటంలో,

**(స్థితిమధిగతాః మే చేతసో వృత్తయః)** – **"పరన్ద శిన్దై యొన్ది నిన్దు"** (విస్తరించిన మనస్సును ఆశ్రయించి నిలచియుండే) అని తిరుమ*ళి*శైప్పిరాన్ పల్కిన రీతిలో కన్పించిన చోట అంతా కాళ్ళు మోపి సంచరించి పరిభ్రమించిన నా మనోవ్యాపారాలు ఇపుడు శ్రీరంగనాథుని **"కతిరాయిర మిరవి కలన్దెరిత్తాలొత్త నీణ్ ముడి"** (వేల సూర్యులు ఒకటిగా కలసి ప్రకాశించినట్లుగా ఉండే, ఉన్నతమైన కిరీటం) లో నిలచి ఉన్నవై, వేఱు కాలక్షేపం లేనివై, అయినందున,

**(రాజన్వత్యః అభూవన్) –** అరాజకంగా ఉండే వాటి ఆ స్థితి తీరినదని భావం. అరాజకంగా ఉండే చోటనేకదా అడిగేవారు లేకుండా స్వైరంగా సంచరించవచ్చు. సురాజకమైన చోట ఆ విధంగా స్వచ్ఛందవిహారం చేయడం వీలుకాదుకదా! అందువల్ల తమ చిత్త వృత్తుల స్వైరసంచారం తీరేటట్లుగా చేసినది – శ్రీరంగనాథుని దివ్యకిరీటం– అని అన్నారు.

**10) పాదాంభోజం స్పృశతి భజతే రంగనాథస్య జంఘామ్**
**ఊరుద్వంద్వే విలగతి శనై రూర్ధ్వ మభ్యేతి నాభిమ్ ।**
**వక్షస్యాస్తే వలతి భుజయో ర్మామికేయం మనీషా**
**వక్త్రాభిఖ్యాం పిబతి వహతే వాసనాం మౌళిబంధే ॥**

మామికా ఇయం మనీషా = నాకు చెందిన ఈ బుద్ధి, రంగనాథస్య = శ్రీరంగనాథుని యొక్క, పాద+అంభోజం స్పృశతి = శ్రీచరణపద్మాన్ని అవగాహిస్తున్నది, జంఘాం భజతే = (తరువాత) పిక్కలను భక్తితో సేవిస్తున్నది, ఊరుద్వంద్వే శనైః విలగతి= (తరువాత) ఊరుయుగంలో మెల్లిగా చిక్కుకుంటున్నది, ఊర్ధ్వం నాభిమ్ అభ్యేతి = (తరువాత) పైన తిరునాభిని సమీపిస్తున్నది, వక్షసి ఆస్తే = (తరువాత) వక్షఃస్థలంలో నిలచి ఉన్నది, భుజయోః వలతి = భుజాలలో పరిభ్రమిస్తున్నది, వక్త్ర + అభిఖ్యాం = తిరుముఖమండలంలోని శోభను, పిబతి=పానం చేస్తున్నది, మౌళిబంధే=శిఖా బంధంతో. వాసనాం వహతే = దృఢమైన సంస్కారాన్ని వహిస్తున్నది.

పూర్వం తొమ్మిది శ్లోకాలతో శ్రీరంగనాథుని ఒక్కొక్క దివ్యావయవంయొక్క శోభను దేశికులు ప్రత్యేక ప్రత్యేకంగా స్తుతించారు. ఆ విధంగా ప్రత్యేకంగా అనుభవించిన సకలావయవాల యొక్క అందాన్ని ఇందులో కలిపి అనుభవిస్తూ ఆనందిస్తున్నారు. తిరువాయ్‌మొழிలో ఆழ்వార్లు **"ఏழையరావి యుణ్ణుమ్"** (అనాథుల ప్రాణాలను హరించే) అనే దశకంలో తిరునేత్రాలు, నాసిక, వదనం, కనుబొమలు, మందస్మితం, కర్ణద్వయి, ఫాలం – అనే అవయవాలను ప్రత్యేక ప్రత్యేకంగా ఒక్కొక్క పాశురంలోను అనుభవించి, **"కోళிழைత్తామరై"** అనే ఎనిమిదవ పాశురంలో అంతవరకు అనుభవించిన అవయవాన్నిటిని ఒకటిగా కలిపి అనుభవించారుకదా. ఇక్కడ ఈడు వ్యాఖ్యలో నంబిళ్ళై రసఘనంగా అవతారికను అనుగ్రహించారు. ఏవిధంగా అంటే, **"అఙ్గు మిఙ్గుమ్ శిదఱి క్కిడన్ద పడైయై, శత్రుక్కళ్ వన్దు ముడుకినవాఱే, ఒన్నాక త్తిరట్టి ఒరుకాలే తళ్ళువారైప్పోలే, తనిత్తనియే నలిత్త అழகుకళెల్లామ్ తిరళ వన్దు నలికిఱపడియై చ్చొల్లుకిఱార్"** (అక్కడ ఇక్కడ చెల్లాచెదురుగా పడి ఉండే సైన్యాన్ని, శత్రువుల తనపై దండెత్తగానే ఒకటిగాచేర్చి ఒక్కమారు నడిపించేటట్లుగా, వేఱు వేఱుగా బాధించిన స్వామి అందాలు అన్నీ ఒకమారు కలసి తమను బాధించిన రీతిని తెల్పుతున్నారు) అని. అక్కడ ఆழ்వార్లు క్లేశపడే సందర్భం కనుక ఆ విధంగా చెప్పవలసి వచ్చింది. ఇక్కడ క్లేశపడడం కాకుండా, **"సంప్రీణాతి"**, అని **"నిర్విశతి"** అని ఆనందంతో చెప్పే సందర్భం కనుక పరమప్రీతితో దేశికుల అనుభవం సాగుతున్నది.

శ్రీచరణాలనుండి తిరుముఖ మండలంవరకు ముఖ్యమైన దివ్యావయవాలలో మనస్సు అభినివేశాన్ని పొందిన రీతినిగూర్చి ఈ శ్లోకంలో పల్కుతున్నారు. శ్రీచరణ పద్మాలలో మనస్సు చక్కగా చేరి ఉంటే, **"తాళ్ కణ్డవర్ తాళే కణ్డార్"** (శ్రీరాముని భుజాలను దర్శించినవారు, ఇక ఆ భుజాలనే దర్శించారు) అనే రీతిలో వాటిని దాటి ఆ వైపు పోవడానికి అవకాశం ఉండదు కనుక, **"పాదాంభోజం స్పృశతి"** అని అన్నారు. శ్రీచరణాలలో స్పర్శమాత్రమే కల్గింది.

**(జంఘాం భజతే)** ప్రీతిపూర్వకసేవనం ఇక్కడ (పిక్కలలో) తెలుపబడింది. స్తుతి ఆరంభంలో, పిక్కలలో అభినివేశాన్ని పొంది – **"మదాత్మా రంగభర్తుః జంఘాం దృష్ట్వా జనన పదవీజాంఘికత్వం జహాతి"** అని పలికారు. కనుక సంసారవిమోచనాన్ని కల్గించిన చోట భక్తిని కల్గి ఉండడం తగినదికదా!

**(ఊరుద్వంద్వే శనైః విలగతి)** ఊరుద్వంద్వంలో మెల్లగా చిక్కుకొంటున్నది. పూర్వం ఊరుద్వంద్వంలో అభినివేశాన్ని పొందేటపుడు **"కమలాభూమినీళోపధానమ్"** (లక్ష్మీ భూనీళలకు తలదిండు) అని పల్కినవారు కనుక, శ్రీచరణాలను సంవాహనం చేసిన దేవేరులు శ్రమతో అలసటను చెంది, నిద్రించే చోట నిద్రాభంజకంగా కోలాహలాన్ని చేయకుండా మెల్లిగా వర్తిస్తున్నది – అని అంటున్నారు.

**(నాభి మూర్ధ్వమభ్యేతి)** – గంభీరమైన తిరునాభి చాలా పెద్దసుడివలె ఉన్నందు వల్ల అక్కడకు పోవడానికి భయపడి చుట్టి ప్రదక్షిణంగా వచ్చి పైకి వెళ్ళింది.

**(వక్షసి ఆస్తే)–** వక్షస్సు, లక్ష్మీదేవి నిత్యవాసం చేసే చోటు కనుక, అక్కడ నిర్భయంగా విశ్రాంతిని పొందుతున్నది.

**(వలతి భుజయోః)** బాహువులకు పిమ్మట తిరుముఖమండలంకదా ఉన్నది. అందులో అనుభావ్య విషయాలు అపరిమితాలైనందువల్ల విలక్షణమైన ఆ అనుభవం వెంటనే లభించబోతున్నదనే వేగాతిశయంతో, తుమ్మెదలు తామర పూవులలో వేగంగా ప్రవేశించకుండా పైపైన తిరిగే రీతిలో, ఇక్కడకూడా భుజపరిసరంలో పరిభ్రమిస్తున్నది.

**(వక్త్రాభిఖ్యాం పిబతి)** – భుజాలలో పరిభ్రమించడంవల్ల కల్గిన శ్రమ తీరేటట్లు **"లోచనాభ్యాం పిబన్నివ"** (రెండు కన్నులతో పానం చేస్తున్నట్లుగా) అనే రీతిలో తిరుముఖమండల శోభను పానం చేసి శ్రమ తీరిన రీతి తెలుపబడింది. **"హరిసరసి విగాహ్యాపీయ తేజోజలౌఘం భవమరుపరిఖిన్నః ఖేదమద్య త్యజామి"** (హరి అనే చల్లని సరస్సులో మునిగి, అందులోని తేజస్సు అనే నీటిని తాగి, సంసారమనే ఎడారిలో

పొందిన తాపాన్ని పొందిన నేను నా దుఖాన్ని తీర్చుకుంటున్నాను.) అనే ముకుందమాలా శ్లోకాన్ని ఇక్కడ అనుసంధించాలి.

**(మౌళి బంధే వాసనాం వహతే) – "ము*ఱ్ఱ* ఇమ్మూవులకుమ్ విరికిన్ఱ శుదర్ముడిక్కే ఒ*ఱ్ఱ*మై క్కొణ్డతుళ్ళమ్"** (ఈ ముల్లోకాలలో అంతటా విస్తరించే ప్రకాశాన్ని కల్గిన స్వామి కిరీటానికే నామనస్సు అధీనమైనది) అనే తిరువాయ్మొ*ౖ*ళిలోని పాశురం ఈ సూక్తిగా రూపొందింది.

**11) కాంతోదారై రయమిహ భుజైః కంకణజ్యాకిణాంకైః**
**లక్ష్మీధామ్నః పృథులపరిఘైః లక్షితాభీతిహేతిః ।**
**అగ్రే కించిద్భుజగశయనః స్వాత్మనై వాత్మనస్సన్**
**మధ్యేరంగం మమ చ హృదయే వర్తతే సావరోధః ॥**

ఇహ=ఈచోట, కాంత + ఉదారైః = అందమైనవి, ఉదారాలైనవి, కంకణ జ్యాకిణ+ అంకైః = కరభూషణాలవంటి అల్లెత్రాడువల్ల ఏర్పడిన కిణాలను కల్గినవి, లక్ష్మీ ధామ్నః= లక్ష్మీదేవియొక్క లీలాగృహమైన వక్షఃస్థలంయొక్క, పృథుల పరిఘైః = దృఢమైన పరిఘల (రక్షణ సాధనాల) వంటివి అయిన, భుజైః = భుజాలతో, లక్షిత+అభీతి హేతిః= అభయాన్ని ఇచ్చే దివ్యాయుధాలను కల్గినవాడైన, అయం భుజగశయనః = ఈ ఆదిశేష శయనుడైన శ్రీరంగనాథుడు, కించిత్ + అగ్రే = కొంచెం ముందుగా, స్వాత్మనా+ఏవ ఆత్మనః సన్ = తానే తనలో భాసిస్తూ (మూలమూర్తినుండి ఆవిర్భవించిన ఉత్సవ మూర్తియై), సావరోధః = లక్ష్మీదేవితో కూడినవాడై, మధ్యేరంగం = శ్రీరంగం నడుమలోను, మమ హృదయే చ= నా హృదయంలోను, వర్తతే = వేంచేసి ఉన్నాడు.

పూర్వోక్త శ్లోకాలన్నీ మూలమూర్తి అయిన శ్రీరంగనాథుని (పెరియ పెరుమాళ్ను) అనుభవించి పల్కినవి. ఈ శ్లోకంతో, నమ్పెరుమాళ్ అనే ఉత్సవమూర్తినికూడా కలిపి దేశికులు కీర్తిస్తున్నారు. భట్టర్ శ్రీరంగస్తవం పూర్వశతకంలో **"శ్రీరంగాంతర్మందిరమ్"** (శ్రీరంగంలోని గర్భగృహం) అనే అఱువైయవ శ్లోకంతో గర్భగృహాన్ని కీర్తించి, తరువాత రెండు శ్లోకాలతో పాద సంవాహనం చేసే స్త్రీ చామరగ్రాహిణులను నమస్కరించి, ఆ తరువాత **"ఉత్ఫుల్లపంకజతటాక మివ"** (చక్కగా వికసించిన పద్మాలను గల సరస్సును వలె) అనే అఱువై మూడవ శ్లోకంనుండి 14 శ్లోకాలతో ఉత్సవమూర్తిని స్తుతించి, తరువాత, **"స్వఫణవితానదీప్తే"** త్యాదిశ్లోకంతో ఆరంభించి మూలమూర్తిని కీర్తించారు. ఆ*ౖ*ళ్వార్లు, ఆచార్యులు మూలమూర్తి, ఉత్సవమూర్తి – అనే భేదాన్ని చూపకుండా, సామాన్యంగా అనుభవిస్తారు (కీర్తిస్తారు). అయినా, ఇంచుమించుగా మూలమూర్తి

అనుభవమే ప్రాయికంగా ఉంటుంది. ఈ శ్లోకంలో, **"కించిదగ్రే స్వాత్మనైవాత్మనః సన్"** అనే ప్రయోగం ఉత్సవమూర్తిని ఉద్దేశించి చేసినదే. మూర్తిభేదంగా కన్పించినా వాస్తవంలో తానే తననుండి వ్యక్తమై ఉన్నవాడు కనుక, భేదం లేదని తెలుపబడింది.

**"కైయినార్ శురిశఙ్గనలాழியర్... అణి యరఙ్గనార్ అరవినణైమిశై మేయ మాయనార్"** (శ్రీహస్తాలలో, సుదులను కల పాంచజన్యశంఖాన్ని, అగ్నిని వెలువరించే సుదర్శన చక్రాన్ని కలవాడు.... అందమైన శ్రీరంగంలో ఉండే స్వామి, ఆదిశేషునిపై పరుండి ఉండే ఆశ్చర్యమైన లీలను చేసేవాడు) అనే పాణ్‌పెరుమాళ్ శ్రీసూక్తిలో దృష్టిపెట్టు కొని శ్లోకంలోని పూర్వార్ధం రచింపబడింది. శ్రీరంగనాథుని భుజాలకు మూడు విశేషణాలు ప్రయోగిస్తున్నారు– **"కాంతోదారైః, కంకణజ్యాకిణాంకైః, లక్ష్మీధామ్నః పృథులపరిఘైః"** అని అంటూ, **"అలమ్ పురిన్ద నెడుమ్ తడక్కై"** (ఇక చాలు–అని అనిపించే రీతిలో ఉదారంగా కోరికలను ఇచ్చే గొప్ప చేతిని కలవాడు) కనుక **"కాంతోదారైః"** అని అనబడింది. **"చకాసతం జ్యాకిణకర్కశై శ్శుభై శ్చతుర్భి రాజానువిలంబిభిః భుజైః"** (వింటితాడు తాకిడివల్ల ఏర్పడిన కాయలను కల్గినవి, శుభకరమైనవి, మోకాలి వరకు సాగియున్నవి అయిన నాల్గు బాహువులతో ప్రకాశించేవారు) అనే ఆళవన్దార్ శ్రీసూక్తిని, **"జ్యాకిణాంక పరికర్మధర్మిణో భాంతి సుందరభుజస్య బాహవః"** (అల్లెతాడు తాకిడి వల్ల ఏర్పడిన కాయలను అలంకారంగా కల్గిన సుందరబాహువులు ప్రకాశిస్తున్నవి) అనే కూరేశుల శ్రీసూక్తిని అనుసరించి **"కంకణజ్యాకిణాంకైః"** అని ప్రయోగింపబడింది. **"తழும్బిరున్ద శార్ఙ్గనాణ్ తోయ్న్దవామ్ అఙ్గై"** (అందమైన భుజాలలో శార్ఙ్గం వింటినారి తాకిడి వల్ల ఏర్పడిన కాయలు ఉన్నాయి) అనే పొయ్‌కై ఆழ్వార్ల పాశురం వీటికి అన్నిటికీ మూలం. విభవావతారాలలో ఉండే జ్యాకిణాంకాలు అర్చావతారంలో కూడా భావనాప్రకర్షవల్ల దర్శింప బడుతున్న తీరు ఇది.

**(లక్ష్మీధామ్నః పృథులపరిఘైః) – "పూవార్ తిరుమామకళ్ పుల్కియ మార్బన్"** (లక్ష్మీదేవి నిత్యవాసం చేసే వక్షస్సు) అయినందువల్ల లక్ష్మీదేవికి అంతఃపురమైన వక్షః స్థలానికి చాలా గొప్ప రక్షకం ఏర్పరచినట్లుగా స్వామి బాహువులు ఉన్నవి – అని భావం. ఇటువంటి బాహువులలో పూవును ధరించినట్లుగా దివ్యాయుధాలను ధరించి, మంగళాశాసనపరులకు వారి భయాన్ని తీరుస్తున్నాడు, శ్రీరంగనాథుడు – అనే భావం, **"లక్షితాభీతిహేతోః"** అనే ప్రయోగంవల్ల ఏర్పడుతున్నది. ఇటువంటి శ్రీరంగనాథుని మూలమూర్తి, ఉత్సవమూర్తి దివ్యదేవేరులతో పాటుగా శ్రీరంగ విమానంలోమాత్రం

కాదు వేంచేసి ఉన్నది; నా హృదయంలోకూడా నిత్యవాసాన్ని చేస్తున్నాడు – అని అంటున్నారు. ఇది సంసిద్ధయోగస్థితిని తెలుపుతున్నది.

**12) రంగాస్థానే రసికమహితే రంజితాశేషచిత్తే**
**విద్వత్సేవావిమలమనసా వేంకటేశేన క్లుప్తమ్ ।**
**అక్లేశేన ప్రణిహితధియా మారురుక్షో రవస్థాం**
**భక్తిం గాఢాం దిశతు భగవద్ధ్యానసోపాన మేతత్ ॥**

రసికమహితే = రసికులచే ప్రతిష్ఠను పొందిన చోటు, రంజిత + అశేషచిత్తే = అందటి హృదయాలను రంజింపజేసేది అయిన, రంగ + ఆస్థానే = శ్రీరంగ దివ్యాలయంలో, విద్వత్సేవావిమలమనసా = విద్వాంసులను సేవించి, నిర్మలమైన మనస్సును కల్గినవారైన, వేంకటేశేన = శ్రీమద్వేంకటనాథార్యులచేత, క్లుప్తం = రచింప బడిన, ఏతత్ = ఈ, భగవద్ధ్యానసోపానమ్ = భగవద్ధ్యానసోపానమనే స్తుతి, ప్రణిహితధియాం = సమాహిత మనస్కుల, అవస్థాం = స్థితిని, అక్లేశేన = సులభంగా, ఆరురుక్షోః = అధిరోహించగోరినవానికి, గాఢాం భక్తిం = గంభీరమైన భక్తిని, దిశతు = అనుగ్రహించుగాక.

శ్రీ దేశికులు, ఈ స్తుతికి ఫలాన్ని అనుగ్రహించి ముగిస్తున్నారు. దీనికి సోపానమనే తిరునామాన్ని పెట్టినదానికి తగినట్లుగా ఫలం చెప్పబడుతున్నది. కిందనుండి పైకి అధిరోహించాలని వెళ్ళాలని కోరేవారికి సోపానాలు (మెట్లు) ఉపకరిస్తారు. స్తుతిరూపమైన ఈ సోపానం కూడా యోగసిద్ధిలో ఆరురుక్షువులకు సహాయ పడుతుంది–అని భావం.**"ఆరురుక్షోః"** అనేది జాత్యేకవచనం. **"జనస్య"** అనే పదాన్ని అధ్యాహరించుకోవాలి.

శ్రీదేశికులు, **"ముత్తి తరుమ్ నకరెళ్ళిల్ ముక్కియమామ్ కచ్చి"** (ముక్తిని ఇచ్చే క్షేత్రాలు ఏడింటిలో ముఖ్యమైన కాంచీనగరం)లో అవతరించి, **"అడియవర్క్కు మెయ్యన్"** (దాసులపట్ల సత్యస్వరూపుడు) అయిన దైవనాయకస్వామి దివ్యక్షేత్రమైన తిరువహీంద్ర పురంలో హయగ్రీవులయొక్క, వైనతేయునియొక్క నిరవగ్రహానుగ్రహాన్ని పొంది, **"క్వచన రంగముఖ్యే విభో! పరస్పరహితైషిణాం పరిసరేషు మాం వర్తయ"** (అభీతిస్తవం) (ప్రభువు! శ్రీరంగంలో, పరస్పర హితాన్ని కోరేవారి పరిసరంలో ఎక్కడో ఒకచోట నేను నివసించేటట్లుగా అనుగ్రహించు) అని ప్రార్థించే రీతిలో పరస్పరహితాన్ని కోరేవారై, రసికులైన విద్వత్సార్వభౌములు నివసించే చోటు శ్రీరంగక్షేత్రం అని విని, గొప్ప అభినివేశంతో అక్కడకు వేంచేసి, రసిక విద్వదాచార్యపాదపరిసరంలో **"తద్విద్ధి ప్రణిపాతేన**

**పరిప్రశ్నేన సేవయా"** (మహాత్ములు, తమకు నమస్కరించడం ద్వారా, ప్రశ్నించడం ద్వారా, శుశ్రూష చేయడం ద్వారా ఉపదేశిస్తారని గ్రహించు) అనే గీతాచార్యోపదేశ ప్రక్రియలో సేవించి, విహతకల్మష శేముషీకులైన (మనసులోని మాలిన్యం తీరినవారైన) రీతిని పూర్వార్ధంలో యథాతథంగా పలికారు. **''విద్వత్సేవా''** అనేచోట ప్రతిపాదింపబడినవారైన శ్రీరంగస్థల నిత్యవాసివిద్వాంసులు రసికులై, అశేషచిత్తరంజకులై ఉన్నారు - అనే భావాన్ని తెల్పుతున్నవి. **"రసికమహితే", "రంజితాశేషచిత్తే"** అనే రెండు శ్రీరంగస్థలవిశేషణాలు.

**"అక్లేశేన"** అనే పదం **"క్లుప్తమ్"** అనేదానిలోకూడా అన్వయించవచ్చు - అని కొందఱు భావించినా, అందులో స్వారస్యం లేదు. అప్రసక్తప్రతిషేధం ఎందుకు? పైగా, అన్వయక్లేశంకూడా ఉన్నది. నాల్గవ పాదంలో **"దిశతి"** అనే పాఠం ఉన్నది. భవిష్యదర్థకంగా చెప్పకుండా, **"దిశతు"** అని వర్తమానార్థకంగా పల్కడం - భావనా ప్రకర్షవల్ల, స్పష్టత కోశం వల్ల. ఈ స్తుతి పూర్తిగా మందాక్రాంతావృత్తంలో రచింపబడింది.

**వ్యాచక్రుః భగవద్ధ్యానసోపానస్తుతి మద్భుతామ్ ।**
**వేదాంతదేశికక్లుప్తాం వాదిభీకరవంశజాః ॥**

**గురవోఽణ్ణంగరాచార్యాః ద్రావిడ్యాం హృదయంగమమ్ ।**
**సోపానదీపికాభిఖ్యాం తద్వ్యాఖ్యా మాంధ్రభాషయా ॥**

**అనువాదం చకార శ్రీశింగరార్యో యథామతి ।**
**గుణదోషవిదాం ప్రీత్యై యత్నోఽయం కల్పతాం సతామ్ ॥**



శ్రీమతే రామానుజాయ నమః



శ్రీవేదాంతదేశికప్రణీతమైన

# న్యాసదశకమ్

## సవ్యాఖ్యానమ్

### అవతారిక

శ్రీవేదాంతదేశికులు సకలశాస్త్రార్థ తత్త్వాలను కరతలామలకంగా దర్శించిన మహానుభావులు. వీరు ప్రపత్తి శాస్త్రార్థాన్ని న్యాసదశకము, న్యాసతిలకము, న్యాస వింశతి - అనే మూడు దివ్యాలైన స్తోత్రాలద్వారా అనుగ్రహించాలని తలచి, మొట్ట మొదటగా ఈ న్యాసతిలకమనే స్తోత్రాన్ని ప్రసాదించారు. దీనిలోని మొదటి శ్లోకం మాత్రం పరోపదేశ ప్రక్రియలో రచింపబడింది. మిగిలిన శ్లోకాలన్నీ ప్రపత్తిని దేశికులు అనుష్ఠించే క్రమంలో - అంటే - స్వానుష్ఠానక్రమంలో రచింపబడ్డాయి. ఈ స్తుతి కంచి వరదరాజస్వామిని దృష్టిలో ఉంచుకొని రచింపబడినదనే అంశం స్తోత్రాన్నిబట్టి వ్యక్తమవుతున్నది.



**1) అహం మద్రక్షణభరో మద్రక్షణఫలం తథా ।**
**న మమ శ్రీమతేరేవేత్యాత్మానం నిక్షిపేద్బుధః ॥**

బుధః = స్వస్వరూపాన్ని చక్కగా తెలిపిన, వివేకి అయిన అధికారి, ఆత్మానం నిక్షిపేత్ = ఆత్మసమర్పణాన్ని చేయాలి. (ఈ ఆత్మసమర్పణం ఏవిధంగా అనుసంధిస్తూ చేయాలి? – అంటే) అహం న మమ = నేను నాకు చెందినవాడను కాదు (నేను నా సొత్తు కాదు), మద్రక్షణభారం న మమ = నన్ను రక్షించే భారంకూడా నాది కాదు, తథా మద్రక్షణ ఫలం న మమ = అదే రీతిలో, నేను రక్షింపబడడంవల్ల వచ్చే ఫలంకూడా నాది కాదు, శ్రీపతేః ఏవ = ఇవి అన్నీ శ్రియఃపతికి చెందినవే, ఇతి = అని అనుసంధిస్తూ ఆత్మసమర్పణాన్ని చేయాలి.

"ఆత్మసమర్పణాన్ని చేయడానికి, "నేనెవరిని? సర్వస్వామి అయిన శ్రియఃపతికి సమర్పించడానికి అంటూ మనకు స్వంతం అయిన వస్తువు అనేది ఒకటి ఉన్నదా? లేదే! ఆళ్వార్లు కూడా – **"ఎనతావి తన్దొழிన్దేన్, ఇని మీళ్వదు ఎన్నదుణ్డే!"** (నా ఆత్మను సమర్పించాను. ఇక దానిని నేను తిరిగి పొందడం అనే విషయం ఉన్నదా?) అని పల్కి, వెంటనే, **"ఎనతావి యార్! యాన్ ఆర్? తన్ద నీ కొణ్డాక్కినైయే!"** (నా ఆత్మ ఎవరు? నేనెవరు? నాకు ఆత్మను ఇచ్చిన నీవే దానిని తిరిగి తీసికొన్నావు గదా!) అని అనుగ్రహించారు కదా! **"ఉదవి క్కైమ్మాఱు ఎన్నుయిరెన్నవుర్రెణ్ణిల్, అదువు మర్రాఙ్గవన్ తన్నతు ఎదువు మొన్రుమిల్లై శెయ్‌వదు ఇఙ్గు మఙ్గే"** (భగవంతుడు చేసిన ఉపకారానికి ప్రత్యుపకారం నా ఆత్మను సమర్పించడమే – అని ఆలోచించినా, నా ఆత్మ స్వరూపాన్ని గమనిస్తే అది, మిగిలినవి అన్నీ భగవానునకు చెందినవే. ఈ లోకంలో, పరమపదంలో కూడా భగవానునకు సమర్పించగలిగేది ఏదీలేదు?) అనికూడా ఆళ్వార్లు వచించారు. భగవద్యామునులుకూడా పరమవైదికులు అవడంవల్ల **"అహ మద్యైవ మయా సమర్పితః"** (నా ఆత్మను నేను ఈనాడే సమర్పించుకొన్నాను!) అని పల్కి వెంటనే, **"మమ నాథ! యదస్తి యోఽ స్మ్యహం సకలం తద్ధి తవైవ మాధవ!"** (ఓ మాధవా! స్వామీ! నేనెవడనో, నాకు చెందిన వస్తువులు ఏవి ఉన్నాయో, అవి అన్నీ నీకు చెందినవే కదా!) అని అనుతపించారు కదా! ఆ విధంగా అన్న ఆళ్వార్లే **"తోళ్‌వళై యార త్తழாవి ఎన్నుయిరై అఱవిలై శెయ్‌దనన్ శోదీ!"** (ఓ! జ్యోతిస్సరూపా! నా చేతులారా తడిమి ఆత్మను నేను సమర్పించుకొన్నాను.) అని అంటూ నిర్వేదంతో ఆత్మసమర్పణాన్ని చేయాలి అని సూచించారు. కాబట్టి, "నేను నాకు చెందినవాడను కాను. నన్ను రక్షించుకొనే బాధ్యత కూడా నాది కాదు. నన్ను రక్షించినదానివల్ల కలిగే ఫలం సైతం నాది కాదు. అంతా ఆ స్వామిదే" అనే యథార్థాన్ని అనుసంధిస్తూ, వివేకి అయినవాడు ఆత్మనిక్షేపాన్ని చేయాలి – అని శ్లోకతాత్పర్యం.

**2. న్యస్యామ్యకించనః శ్రీమన్! అనుకూలోఽ న్యవర్జితః ।**
**విశ్వాసప్రార్థనాపూర్వ మాత్మరక్షాభరం త్వయి ॥**

(హే) శ్రీమన్ = ఓ లక్ష్మీనాథా!, అకించినః=ఏమీ లేనివాడనైన నేను, అనుకూల= అనుకూల్యసంకల్పంతో కూడినవాడనై, అన్యవర్జితః = అనుకూల్యానికి వ్యతిరేకమైన ప్రాతికూల్యం యొక్క గంధాన్నికూడా ఏమాత్రం లేనివాడనై, విశ్వాసప్రార్థనాపూర్వం = నీవు తప్పక రక్షించి తీరుతావు – అనే మహావిశ్వాసంతో, నీవు నన్ను రక్షించాలి –

అనే ప్రార్థనతో, త్వయి = నీ సన్నిధిలో, ఆత్మరక్షాభరం = స్వరక్షణభారాన్ని, న్యస్యామి = సమర్పిస్తున్నాను.

ఆత్మసమర్పణాన్ని చేసేటపుడు, అది విశ్వాసం, ప్రార్థన – అనే రెండిటిలో కలసి ఉండాలి. విశ్వాసం అంటే – నమ్మకం. భగవానుడు సర్వస్వామి అవడంవల్ల, తన వస్తువును రక్షించుకోవడంలో తానే తప్పక ప్రయత్నించి తీరుతాడు – అనే నమ్మకం. దీనికే మహావిశ్వాసం – అనికూడా పేరు. ప్రార్థన అంటే – **"త్వమేవోపాయభూతో మే భవేతి ప్రార్థనామతిః శరణాగతిః"** (నువ్వే నాకు ఉపాయం కావాలి – అని మానసికంగా ప్రార్థించడమే శరణాగతి.) అన్నట్లు "స్వామీ! నీవే నాకు ఉపాయంగా కావాలి" అనే ప్రార్థన మానసికమైనది. ఈ ప్రార్థనే శరణాగతి అని భగవచ్ఛాస్త్రంలో (పాంచ రాత్రంలో) చెప్పబడిందికదా! అందువల్ల, **"ప్రార్థనాపూర్వమ్"** అని ప్రత్యేకంగా చెప్పడం ఎందుకు? అని సందేహించనవసరం లేదు. ఆత్మనిక్షేపణాన్ని వాచికంగా కానీ, కాయికంగా కాని చేసేటప్పుడు, అవి విశ్వాసప్రార్థనాపూర్వకాలుగా ఉంటాయని చెప్పడమే ఇక్కడ ఉద్దేశ్యం. **"నోఱ్ఱ నోన్బిలేన్ నుణ్ణఱివిలేన్"** (నేను నోచిన నోము ఏదీ లేదు, తెలిసికొన్న జ్ఞానం ఏమీలేదు) అని, **"న ధర్మనిష్ఠోఽస్మి న చాత్మవేదీ"** (నేను ధర్మంలో నిలకడగా ఉన్నవాడను కాను. ఆత్మజ్ఞానం నాకు లేదు.) అని పల్కిన రీతిలో ఆకించన్యాన్ని కల్గినవాడనై, ఆనుకూల్యసంకల్పాన్ని కలవాడనై, ప్రాతికూల్యగంధలేశంకూడా లేనివాడనై ఆత్మనిక్షేపణాన్ని చేస్తున్నానని దీనివల్ల నివేదించినట్లయింది.

### 3. స్వామిన్! స్వశేషం స్వవశం స్వభరత్వేన నిర్భరమ్ ।
### స్వదత్తస్వధియా స్వార్థం స్వస్మిన్ న్యస్యసి మాం స్వయమ్ ॥

స్వామిన్ = సర్వస్వామివి అయిన ఓ శ్రియఃపతీ, స్వశేషమ్ = నీకు మాత్రమే శేషమైనది. స్వవశం= నీకే వశమైనది, స్వభరత్వేన నిర్భరమ్=నీకే భారమై, అందువల్ల, ఏ విచారాన్ని లేనివాడనై, స్వార్థమ్ = నీకే ప్రయోజనం గలిగేటట్లు, స్వయమ్ = నీవే, స్వస్మిన్ న్యస్యసి = నీయందు ఆత్మనిక్షేపాన్ని చేసికొంటున్నావు.

ఈ శ్లోకంతో మొదటి శ్లోకార్థం మఱింతగా వివరింపబడినట్లయింది. రెండవ శ్లోకంలో **"అకించనః అహం స్యామ్"** అని అనుగ్రహించడాన్ని గమనించి, కొందఱు భ్రాంతి చెందకుండా ఉండేటట్లు ఈ శ్లోకంలో చక్కగా వివరించబడింది. తిరువాయ్మొழிలోని **"ఎన్ నుణ్ణఱివినుళ్ళే యిరుత్తినేన్"** (అణుస్వరూపమైన నా ఆత్మలో నిన్ను నిలుపుకొన్నాను.) అనే నమ్మాళ్వార్ల సూక్తి రీతిలో ముందుశ్లోకం

అవతరించింది. **"అదువు మవనదిన్నరుళే"** (ఆ భక్తి కూడా భగవంతుని మధురమైన కరుణ యొక్క ఫలమే) అనే రీతిలో ఈ శ్లోకం అవతరించింది. ఇందులో **"స్వామిన్!"** అన్నపుడు **"స్వామీ"** అని **"న్యస్యసి"** అనేదానికి **"న్యస్యతి"** అని పాఠాంతరాలు ఉన్నాయి.

**4. శ్రీమన్! అభీష్టవరద! త్వామస్మి శరణం గతః ।**
**ఏతద్దేహావసానే మాం త్వత్పాదం ప్రాపయ స్వయమ్ ॥**

అభీష్టవరద శ్రీమన్ = అడిగినవారి కోరికలను తీర్చే శ్రియఃపతీ! త్వాం శరణం గతః అస్మి = నిన్ను శరణు చెందినవాడను అయ్యాను, మాం = ఇట్లు నిన్ను ఆశ్రయించిన నన్ను, ఏతత్ దేహ + అవసానే = ఈ వర్తమానదేహం ముగిసే క్షణంలో, స్వయం = నీవే స్వయంగా, త్వత్పాదం ప్రాపయ= నీ పాదాల దగ్గఱకు చేర్చుకో.

**"మరణమానాల్ వైకున్దమ్ కొదుక్కుమ్ పిరాన్"** (మరణం సంభవిస్తే వైకుంఠాన్ని అనుగ్రహించే ఉపకారకుడు) అనే ఆళ్వార్ల శ్రీసూక్తి చొప్పున ప్రపన్నాధికారికి వర్తమానదేహావసానంలో మోక్షం కల్గుతుందనే శాస్త్రార్థం ఇక్కడ సూచింపబడింది. తిరుక్కచ్చినమ్బి శ్రీవరదరాజస్వామి అనుగ్రహంతో శ్రీరామానుజులకు చెప్పిన ఆఱు వార్తలలో **"దేహావసానే మోక్షః స్యాత్"** (ప్రకృత దేహం చివరలో మోక్షం కల్గుతుంది) అనేది కూడా ఒకటి – అనేది ప్రసిద్ధం.

**5. త్వచ్ఛేషత్వే స్థిరధియం త్వత్ప్రాప్త్యైక ప్రయోజనమ్ ।**
**నిషిద్ధకర్మరహితం కురు మాం నిత్యకింకరమ్ ॥**

(శ్రీమన్), త్వత్ శేషత్వే స్థిరధియం = నీకు శేషమై ఉండే విషయంలో స్థిరమైన నిశ్చయాన్ని కలవాడను, త్వత్ ప్రాప్తి + ఏకప్రయోజనమ్ మామ్ = నిన్ను సేవించడం, నీకు కైంకర్యం చేయడం – అనే వీనిని మాత్రమే పరమప్రయోజనంగా కల్గినవాడను అయిన నన్ను, నిషిద్ధకర్మరహితం = శాస్త్రాల్లో నిషేధింపబడ్డ కర్మల్లో, అకరణే ప్రత్య వాయజనకాలు కాని కామ్యకర్మల్లో (చేయనందువల్ల ఎట్టి ప్రత్యవాయం కలుగని కర్మలలో) సంబంధం లేనివానినిగా, నిత్యకింకరం = నిత్యకైంకర్యాన్ని చేసేవానినిగా, కురు = నీవు చేయాలి (సుమా!)

**"పాషాణకల్పతైవ ముక్తిః"** (పాషాణంవలె పడి ఉండడమే ముక్తి.) అని, **"ఆత్యంతికదుఃఖధ్వంస ఏవ ముక్తిః"** (పూర్తిగా దుఃఖం తీరడమే ముక్తి) అని చెప్పేవారితో చేరకుండా, **"ఒழிవిల్ కాలమెల్లామ్ ఉడనాయ్ మన్ని ఒழுవిలా అడిమై"** (విచ్ఛేదం లేకుండా కాలం అంతా స్థిరంగా నిలచిఉండి నిరంతరమైన కైంకర్యం చేయాలి.)

అన్నట్లు సర్వదేశ సర్వకాల సర్వావస్థోచితమైన స్వామికి కైంకర్యాన్ని చేయడమే ముక్తి – అనే సదా చార్యాసంప్రదాయంలో చేరినవారు వీరు. పరమపురుషార్థమైన ఆ కైంకర్యాన్ని ప్రార్థించడం చైతన్యకార్యం, స్వరూపానికి తగినది అవడంవల్ల, అవర్జనీయం (తప్పనిసరి) కావడంవల్ల, ఆ కైంకర్యప్రార్థననే దేశికులు ఇందులో చేశారు – అని తెలియాలి.

**(త్వచ్ఛేషత్వే స్థిరధియమ్) – "కళైవాయ్ తున్బమ్ కళైయాదొழிవాయ్ కళైకణ్ మఱ్ఱిలేన్"** (నీవు నా దుఃఖాలను తీరిస్తే తీర్చు, లేకపోతే లేదు. కాని, నాకు శరణం నువ్వు తప్ప వేఱొకరు లేరు.) అనే రీతిలో దృఢాధ్యవసాయాన్ని తాను కల్గి ఉన్నట్లు తెలియజేసిన వైనం ఇది.

**(త్వత్ప్రాప్త్యైకప్రయోజనమ్)** – చిల్లుపడిన ఓడ గట్టుకు చేరినట్లు, జన్మసముద్రంలో అల్లల్లాడేవానికి పరమప్రాప్యుని పొందించడంతప్ప, వేఱు ప్రయోజనం లేదు కాబట్టి, దీనిని నేను చక్కగా గ్రహించాను – అని తెలియజేసిన క్రమం ఇది.

**(నిషిద్ధకర్మరహితమ్) "క్రియమాణం న కస్మైచిత్ యదర్థాయ ప్రకల్పతే, అక్రియావదనర్థాయ తత్తు కర్మ సమాచరేత్"** (ఏ కర్మను చేసినట్లైతే ఫలం కలుగదో, చేయకపోతే అనర్థం కలుగుతుందో, ఆ కర్మను చేసి తీరాలి.) అనే భగవచ్ఛాస్త్ర ప్రమాణవచనాన్ని బట్టి దేశికులు చేయవలసిన, చేయకూడని కర్మలేవో రహస్యగ్రంథాల్లో వివరించారు. ఏ కర్మను చేస్తే దానిని ఏ ఫలం సిద్ధించదో, ఏ కర్మ చేయకపోతే ప్రత్యవాయం ఏర్పడుతుందో, ఆ కర్మలను మాత్రమే ప్రపన్నుడైన పరమైకాంతి నిర్వహించాలని పై ప్రమాణం చెబుతున్నది. శ్రీమద్రహస్యత్రయసారంలో చరమశ్లోకాధికారంలో **"మా శుచః"** అనే భాగాన్ని వివరించే సమయాన దేశికుల శ్రీసూక్తి **"ఇప్పడి కృతకృత్యనాన ఇవనుక్కు తత్తు కర్మ సమాచరేత్" – ఎన్ఱు విహితమాన కర్తవ్యాంతరమ్ కైంకర్యానుప్రవిష్టసదాచార విశేషమెన్నుమిదమ్ పూర్వాపరగ్రంథఙ్గళిలుమ్, ఇచ్ఛ్లోకమ్ తన్నిల్ "అక్రియావదనర్థాయ – ఎన్గైయాలుమ్ సిద్ధమ్. ఆకైయాల్, మేల్ ఫలసిద్ధియిల్ సంశయ మిల్లామైయాలుమ్, మోక్షోపాయమాక ఒరు కర్తవ్యశేష మిల్లామైయాలుమ్, ఇవనుక్కుళ్ళ కర్తవ్యమ్ ఆజ్ఞానుపాలనరూపమాన స్వయం ప్రయోజనమాకైయాలుమ్, అపరాధమ్ ప్రసక్తమానాల్ అధికారాంతరత్తిల్ శొన్న కట్టళైయిలే అనుతాపాదికళాలే సుపరిహారమాకైయాలుమ్, ఇవన్ హృష్టమనావాక కృతైయిల్లై"** (ఈ విధంగా కృతకృత్యుడైన ప్రపన్నునకు **"తత్తు కర్మ సమాచరేత్"** అని విధింపబడిన కర్తవ్యాంతరం కైంకర్యంలోకి చేరే సదాచార విశేషమనే విషయం పూర్వాపర గ్రంథ భాగాలలోను, ఈ శ్లోకంలోని **"అక్రియావదనర్థాయ"** అని అనడంవల్ల

స్పష్టమవుతున్నది. అందువల్ల, భవిష్యత్తులో ఫలసిద్ధి కల్గడంలో ఏ సందేహం లేనందు వల్ల, మోక్షాన్ని పొందడానికి ఉపాయంగా చేయవలసిన ఏ కర్తవ్యం మిగలనందు వల్ల, ఇతడు చేయవలసిన కర్తవ్యం భగవానుని ఆజ్ఞా పాలనరూపమైన స్వయం ప్రయోజనమైనందువల్ల, అపరాధం సంభవిస్తే అది పూర్వ తెలుపబడిన రీతిలో పశ్చాతాపాదుల వల్ల అది తీరడంవల్ల, ప్రపన్నుడు సంతోషించిన మనస్సుతో ఉండడంలో ఏలోటు లేదు.) ఇత్యాదిగా ఉన్నది. అందుచేత నిషిద్ధకర్మలనుకూడా ప్రపన్నాధికారులు మిక్కిలి జాగ్రత్తగా గుర్తించి, పరిహరించాలి. ఈ అర్థం స్ఫురించేటట్లు **"నిషిద్ధకర్మ రహితమ్"** అని దేశికులు ప్రయోగించారు. **"నిషిద్ధకర్మరహితం మాం నిత్యకింకరం కురు"** అని అన్వయించవచ్చు.

## 6. దేవీభూషణహేత్యాదిజుష్టస్య భగవన్! తవ! ।
## నిత్యం నిరపరాధేషు కైంకర్యేషు నియుంక్ష్వ మామ్ ॥

భగవన్ = షాడ్గుణ్యపూర్తిని కల ఓ శ్రియఃపతీ!, మాం = నీ పాదాలను ఆశ్రయించిన నన్ను, దేవీ – భూషణ – హేతి – ఆది జుష్టస్య తవ = దేవేరులు, దివ్యభూషణాలు, దివ్యాయుధాలు మొదలైనవాటితో కూడిన నీకు చేసే, నిరపరాధేషు కైంకర్యేషు = అపరాధప్రసక్తి లేని కైంకర్యాలలో, నిత్యం నియుంక్ష్వ = ఎల్లప్పుడు (ఇక్కడ–అక్కడా) నియోగించు.

**"తిరుమడన్దై మణ్మడన్దై ఇరుపాలుమ్ తికழ"** (లక్ష్మీదేవి, భూదేవి ఇరువైపుల ప్రకాశించగా) అన్నట్లు శ్రీదేవి–భూదేవి, మిగిలిన దేవేరులు నీతో కలసి ప్రకాశిస్తూండగా, **"శెఙ్గమలక్కழలిల్ శిఱ్ఱిదழ్ పోల్ విరలిల్ శేర్తికழாழికళుమ్ కిఙ్కిణియుమ్, అరైయిల్ తఙ్గియ పొన్ వడముమ్ తాళనన్ మాదుళైయిన్ పూవొడు పొన్మణియుమ్ మోదిరముమ్ కిఱియుమ్ మఙ్గల ఐమ్పడైయుమ్ తోళ్ వళైయుమ్ కుழైయుమ్ మకరముమ్ వాళికళుమ్ శుట్టియు మొత్తిలకవుమ్"** (ఎఱ్ఱని పాద పద్మాల లోపల చిన్న చిగుళ్ళవలె వెలిగే ఉంగరాలు, మువ్వలు, నడుమలోని బంగారు మొలనూలు, బంగారు దానిమ్మపువ్వుతో, మణులతో కూర్చిన మాల, చేతివేళ్ళలో ఉంగరాలు, మంగళకరమైన పంచాయుధమాల, కంకణాలు, కర్ణాభరణాలు, మకర కుండలాలు, చెవి పూలు, పాపిడబొట్టు – అనే ఆభరణాలన్నీ ప్రకాశించగా ) అన్నట్లు పలు దివ్యాభరణాలను అలంకరించుకొని, **"శఙ్గొడు శక్కరమ్ విల్ ఒళ్ వాళ్ తణ్డు"** (శంఖంతో పాటు చక్రం, విల్లు, ఖడ్గం, గద) అన్నట్లు సకలాయుధాలను దాల్చి గొప్పగా

ప్రకాశిస్తూ పరమపదం లోని పేరోలగంలో వేంచేసి ఉండే స్వామిని తాము సేవించాలనే ఆశను దేశికులు ఈ శ్లోకంలో వ్యక్తం చేశారు. **"నిరపరాధేషు కైంకర్యేషు"** అన్నపుడు – శ్రీమద్రహస్యత్రయ సారంలో **"ఇప్పడి భగవచ్ఛేషత్తైకస్వరూపనాకైయాలే శాస్త్రనియతతత్కైంకర్యైకరసనాన ఇవ్వధికారిక్కు ప్పిన్ను అనాపత్తిల్ బుద్ధిపూర్వకమాన అపరాధమ్ వరుకై, పఱ్ఱిన కైంకర్యైకనిష్టైక్కు విరుద్ధమాకైయాలే"** (ఈ విధంగా జీవుడు భగవచ్ఛేషత్వాన్ని స్వరూపంగా కలిగివాడు కనుక, శాస్త్రాలలో చెప్పబడిన కైంకర్యాలను చేయడంలో ఆసక్తికల ఈ అధికారి శరణాగతి చేసిన తరువాత బుద్ధిపూర్వకంగా అపరాధాన్ని చేయడం తాను చేసే కైంకర్య నిష్ఠకు విరుద్ధం కనుక) అని ప్రారంభించి, రసఘనంగా అనుగ్రహించిన అపరాధపరిహారాధికార శ్రీసూక్తివిశేషాలు అనుసంధింప తగినవి. వత్సలుడైన భగవానుడు దోషాలను చూడనివాడని, దోషభోగ్యుడని చెప్పినంత మాత్రంచేత అపరాధాలలో మునిగి ఆరితేరి ఉండడం తగదనే శాస్త్రార్థం ఇక్కడ తెలుపబడింది. **"కైంకర్యేషు నియుంక్ష్వ"** అనేది **"ఏవ మఱ్ఱమరర్ ఆట్చెయ్‌వార్"** (లక్ష్మీదేవి ప్రేరేపించగా నిత్యులు, ముక్తులు భగవంతునకు సేవచేస్తారు) అని, **"ముకప్పే కూవి ప్పణికొళ్ళాయ్"** (నీ సమక్షంలోకి నన్ను పిలిచి నీ సేవను చేసేటట్టు అనుగ్రహించు) అని గల అనేక దివ్యసూరుల సూక్తులను, శ్రీరామాయణంలోని **"స్వయం తు రుచిరే దేశే క్రియతామితి మాం వద"** (నీవే స్వయంగా నీకిష్టమైన చోట పర్ణశాలను నిర్మించమని నన్ను ఆజ్ఞాపించు) ఇత్యాది లక్ష్మణస్వామి సూక్తిని అనుసరించి ప్రయోగింప బడినది.

### 7. మాం మదీయం చ నిఖిలం చేతనాచేతనాత్మకమ్ ।
### స్వకైంకర్యోపకరణం వరద! స్వీకురు స్వయమ్ ॥

(హే) వరద = వరదరాజస్వామీ! మామ్ = దాసుడనైన నన్ను, చేతన + అచేతనాత్మకమ్ మదీయం నిఖిలం చ = చేతనాచేతనాలైన నా సొత్తును అంతటిని, స్వకైంకర్య ఉపకరణం = నీకైంకర్యానికి ఉపకరణాలుగా, స్వయం స్వీకురు = నీవే స్వీకరించు.

**"ఎన్నైయుమ్ ఎన్నుడైమైయుమ్ ఉన్ శక్కరప్పొతి ఒఱ్ఱిక్కొణ్డు"** (నన్ను, నా సొత్తును నీ సుదర్శనచక్రంతో అంకితం చేసుకొని) అనే భట్టనాథసూక్తిని దృష్టిలో ఉంచుకొని దేశికులు ఈ శ్లోకాన్ని అనుగ్రహించారు. మనం చేసే కైంకర్యానికి ప్రతిసంబంధి భగవానుడొక్కడే కాకుండా, తత్సంబంధిసంబంధులవరకు ఆ ప్రతి సంబంధిత్వం అనువర్తించేటట్లే, మనతో సాక్షాత్తుగాకాని, పరంపరయా గాని సంబంధాన్ని కల్గిన చేతనాచేతనాలను అన్నిటిని పరమశేషి అయిన స్వామికైంకర్యంలో ఉపయోగ పడాలనే

ఆశ యుక్తమైనది కావడంవల్ల, ఆ అభిలాష ఇందులో నివేదింపబడింది. మన శరీరంలో ఉన్న సర్వాంగాలు, లోపల ఉన్న ఆత్మకు కైంకర్యోపకరణాలు కావడం లోకానుభవసిద్ధంకదా! ఆ రీతిలోనే ఆ ఆత్మ, ఆత్మీయాలు అన్నీ పరమచేతనుడైన స్వామికి కైంకర్యోపకరణాలుగా కావడం తగినదనే విశేషం ఇక్కడ తెలుపబడింది.

**8. త్వదేకరక్ష్యస్య మమ త్వమేవ కరుణాకర! ।**
**న ప్రవర్తయ పాపాని ప్రవృత్తాని నివర్తయ ॥**

కరుణాకర = కరుణాలవాలా! వరదరాజస్వామీ!, త్వత్ + ఏవ రక్ష్యస్య = నీకు ఒక్కడికే రక్ష్యభూతుడనైన నాకు, త్వమ్ ఏవ – నీవే, పాపాని న ప్రవర్తయ = పాప ప్రవృత్తి కలుగ నట్లు చేయాలి, ప్రవృత్తాని నివర్తయ = చేసిన పాపాలను ఫలం ఇవ్వకుండా ఉండేటట్లు చేయాలి.

పాపాలు చేయకుండా ఉండేటట్లు, చేసిన పాపాలు ఫలించకుండా ఉండేటట్లు నీవే అనుగ్రహించాలని ఇందులో దేశికులు ప్రార్థిస్తున్నారు. **"ప్రవృత్తాని పాపాని నివర్తయ"** (సంభవించిన పాపాలను తీర్చు) అని ప్రార్థించడం తగినదే. కాని, **"పాపాని న ప్రవర్తయ"** (పాపాలలో ప్రవర్తించనీయకు) అని ప్రార్థించడంలో ఏమి ఔచిత్యం ఉన్నది? **"పావమే శెయ్‌దు పావియానేన్"** (పాపాలనే చేసి పాపిని అయ్యాను), **"నానే నానావిద నరకమ్ పుకుమ్ పావమ్ శెయ్‌దేన్"** (నేను పలు విధాలైన నరకాలకు పోయే పాపాలు చేశాను.) అనికదా జ్ఞానుల అనుసంధానక్రమం పాపాలను చేసేవారం మనమే అయినపుడు, "నీవు పాపాలను చేయించకు" అని ప్రార్థించడంలో ఏమి ప్రసక్తి ఉన్నది? – అనే సందేహం కలుగవచ్చు. దీనికి అనేకవిధాలైన పరిహారాలు ఉన్నాయి. **"ఏష ఏవ అసాధు కర్మ కారయతి యమ్ అధో నినీషతి"** (ఈ భగవంతుడే, ఎవనిని అధోగతికి గెంటివేయ దలచాడో, అతనిచే చెడ్డకార్యాలను చేయిస్తాడు.) అనే ఉపనిషత్ ప్రమాణాన్ని బట్టి ఈ విధంగా చెప్పడంలో తప్పులేదు. బ్రహ్మసూత్రాలు **"కర్తా శాస్త్రార్థవత్త్వాత్"** (శాస్త్రం అర్థవతం కావాలి కనుక జీవుడే కర్త) అని పల్కిగా, వెంటనే **"పరాత్తు తచ్ఛ్రుతేః"** అని చెప్పడంవల్ల అనుమంతృత్వం భగవానునియందున్నదని అంగీకరించి తీరాలి కదా! "స్వామీ! నేను పాపప్రవృత్తిని కల్గి ఉన్నపుడు నీవు దానికి అనుమంతగా ఉండకు సుమా!" అనేది ఇచట వివక్షితార్థం. **"న ప్రవర్తయ పాపాని"** అనేటపుడు **"అహం యథా పాపప్రవృత్తో న భవేయం తథా అనుగృహాణ"** (ఏ విధంగా నేను పాపాలను చేయకుండా ఉంటానో, ఆవిధంగా అనుగ్రహించు) అనే అర్థం గ్రహించడం ఉచితం.

**9. అకృత్యానాం చ కరణం కృత్యానాం వర్జనం చ మే ।
క్షమస్వ నిఖిలం దేవ! ప్రణతార్తిహర! ప్రభో! ॥**

ప్రణత + ఆర్తిహర = వరదరాజస్వామీ!, ప్రభో=ప్రభూ!, (దాసుల ఆర్తిని తీర్చే వరదరాజస్వామీ!), అకృత్యానాం కరణం = చేయకూడనివాటిని చేయడం, కృత్యానాం వర్జనంచ = చేయవలసినవాని చేయకపోవడం – అనే, మే నిఖిలం = నా దోషాలను అన్నిటిని, క్షమస్వ = క్షమించు.

ఈ శ్లోకం ముందున్న శ్లోకానికి ఒకవిధంగా వివరణరూపం అనవచ్చు. మనం చేసే పాపాలు అకృత్యకరణ – కృత్యాకరణరూపాలుగా రెండు విధాలుగా ఉంటాయి. చేయకూడనివిగా శాస్త్రాలలో నిషేధింపబడినవానిని చేయడం – అకృత్యకరణం అనబడుతుంది. పరహింస, పరదారాపరి గ్రహం, పరద్రవ్యాపహరణం, అసత్యకథనం, అభక్ష్యభక్షణంవంటివి, ఇవి. ఇక, కృత్యాకరణం అంటే – శాస్త్రాలలో కర్తవ్యాలుగా విధింపబడ్డ సత్కర్మలను చేయకపోవడం. ఇవి శాస్త్రవిశ్వాసం కల ప్రపన్ననకు బుద్ధి పూర్వకంగా ప్రాప్తించే ప్రసక్తి లేకపోయినా, ఈ లోకం **"ఇరుళ్ తరు మాఞాలమ్"** (అజ్ఞానాన్ని కల్గించే విశాలమైన భూమి) అన్నట్లు తమోబాహుళ్యం కావడంవల్ల, ప్రామాదికంగా ఏవైనా పాపాలు చేయడం జరిగితే **"ఎన్నడియార్ అదు శెయ్యార్, శెయ్‌దారేల్ నన్ఱు శెయ్‌దార్ ఎన్బర్‌పోలుమ్"** (నా భక్తులు తప్పులు చేయరు. చేస్తే వారు మంచినే చేస్తారు.) అని, **"కున్ఱనైయ కు*ఱ్ఱ*మ్ శెయ్యినుమ్ కుణమ్ కొళ్ళుమ్"** (తన భక్తులు కొండలంత తప్పులను చేసినా భగవంతుడు వానిని గుణాలుగానే గ్రహిస్తాడు) అని చెప్పబడిన సూక్తులను భావించి, అవలేపంతో – అంటే – తాను ఏ తప్పు చేసినా భగవానుడే క్షమిస్తాడులే! అనే గర్వంతో ఉండరాదు. రెండు తీరాలను కూలగొట్టే కృపాప్రవాహం ఏ సమయంలో ఏ అధికారి విషయంలో ప్రవహిస్తుందో చెప్పలేము. **"ప్రేక్షే కంచిత్ కదాచన"** (ఎప్పుడో ఒక సమయంలో ఎవరినో ఒకరిని నేను కటాక్షిస్తాను.) అన్న ఆ భగవానుని చిత్తానికి తప్ప వేఱొకరి మనస్సుకు తెలిసే అవకాశం లేనందువల్ల "మన అకృత్యకరణ – కృత్యాకరణరూపపాపాలు అతనికి సంతోషప్రదాలే" అని తలచి, గర్వించి ఉండడానికి అవకాశాలేశం కూడా లేదు. క్షమానిధిపట్ల క్షమను ప్రార్థించాలి. శ్రీరామానుజులు సైతం శరణాగతి గద్యలో **"మనోవాక్కాయైః"** అని ప్రారంభించి మూడు చూర్ణికలలో ప్రార్థించిన రీతిలో ఇచటకూడ దేశికుల క్షమను ప్రార్థించారు.

**10. శ్రీమన్! నియతపంచాంగం మద్రక్షణభరార్పణమ్ ।**
**అచీకరః స్వయం స్వస్మిన్ అతోఽహ మిహ నిర్భరః ॥**

శ్రీమన్ = శ్రియఃపతీ, నియతపంచాంగం = అనుకూల్యసంకల్పం మొదలైన అయిదు అంగాలను నియతంగా కల్గిన, మత్ రక్షణభర + అర్పణమ్ = నా రక్షాభర సమర్పణాన్ని, స్వయం = స్వయంగా, స్వస్మిన్ అచీకరః = నీ విషయంలో చేయించు కొందువుగాక! అతః = అందువల్ల, అహం = దాసుడనైన నేను, ఇహ = ఈ నా రక్షణ విషయంలో, నిర్భరః = నిర్విచారంగా ఉన్నాను.

ఈ చివరి శ్లోకంతో దేశికులు, ఈ ఆత్మనిక్షేపం అనేది తమవల్ల నిర్వహింపబడేది కాదు; ఆ భగవానుడే నిర్వహింపజేసికోవాలి – అంటూ మూడవ శ్లోకంలో అనుసంధించిన విషయాన్నే ఇక్కడ ద్రఢీకరిస్తూ ఈ స్తుతిని పరిసమాప్తి చేస్తున్నారు. **"ఆనుకూల్యస్య సంకల్పః, ప్రాతికూల్యస్య వర్జనమ్, రక్షిష్యతీతి విశ్వాసః గోప్తృత్వవరణం తథా, ఆత్మనిక్షేపకార్పణ్యే షడ్విధా శరణాగతిః"** (అనుకూల సంకల్పం, ప్రతికూలాన్ని విడువడం, రక్షించగలడనే విశ్వాసం, రక్షకునిగ వరించడం, తన రక్షణ భారాన్ని సమర్పించడం, ఆకించన్యం – అనే ఈ ఆరు శరణాగతికి అంగాలు) అనే వచనంలో ఈ అంగపంచకం చెప్పబడడం గమనింపదగినది. ఈ ప్రమాణవచనంలో ఆఱు అంగాలు చెప్పబడినా, ఈ ఆఱిటిలో అంగి ఒకటి, మిగిలిన అయిదు అంగాలని కొందఱి భావన. ఆత్మనిక్షేప మనేది అంగి – అని వారి వాదం. మిగిలిన అయిదు అంగాలు. అందువల్లే ప్రకృత శ్లోకంలో **"నియత పంచాంగమ్"** అని చెప్పబడింది.

దేశికులు తమ స్తోత్రాలు అన్నిటిలో చివర **"వేంకటనాథేన విరచితా మేతామ్"** ఇత్యాదిగా తమ నామనిర్దేశాన్ని చేసినా, ఇందులో మాత్రం ఆ రీతిలో చేయకపోవడం ఈ గ్రంథరత్నానికి అనురూపమే. ఆత్మనిక్షేపానికి వలె, తత్ప్రతిపాదకగ్రంథానికి కూడా తాము కర్త కాదనే పరమార్థాన్ని ఈ రీతిలో దేశికులు సూచించారు – అని అనవచ్చు.

దీనిలో **"శ్రీమన్"** అనే స్థానంలో **"శ్రీమాన్"** అని, **"అచీకరః"** అనే పాఠానికి బదులు **"అచీకరత్"** అని పాఠభేదాలు ఉన్నాయి. **"అచీకరత్"** అనేరూపం,**"అచీకరః"** అనేరూపం **"కారయతి"** అనే ణిజంతానికి లఙ్, లుఙ్‌రూపాలు.

**వాదిభీకృద్గురో ర్వ్యాఖ్యాం ద్రావిడీం సంస్మరన్ హృది ।**
**వ్యవృణోన్న్యాసదశకం శింగరార్యో యథామతి ॥**



శ్రీమతే రామానుజాయనమః

శ్రీవేదాంతదేశిక ప్రణీతమైన

# కామాసికాష్టకమ్

## అవతారిక - సవ్యాఖ్యానమ్

**వేదాంతదేశిక ప్రోక్తం స్తవం కామాసికాష్టకమ్ ।**
**దాసః శ్రీశింగరాచార్యో వివృణోతి యథామతి ॥**

## అవతారిక

**"మన్ను మదిళ్ కచ్చివేళుక్కై అళరియై"** అని పెరియతిరుమడల్‌లో తిరుమజ్గై యాళ్వార్లు, మూన్ఱామ్ తిరువన్దాదిలో **"శిఱన్ద ఎన్ శిన్దైయుమ్", "అన్ఱివ్వులకమ్" "విణ్ణకరమ్ వెఃకా"** అనే పాశురాలలో పేయాళ్వార్లు మంగళాశాసనాన్ని చేసిన దివ్యతిరుపతి-వేళుక్కై. ఈ క్షేత్రంలోని అర్చామూర్తి నృసింహరూపిగా సేవను అనుగ్రహిస్తున్నందువల్ల **"శిఙ్గప్పెరుమాళ్ కోయిల్"** అని కూడా ఈ స్థలం వ్యవహరింపబడుతున్నది. **"వేళ్, ఇరుక్కై"** అనే రెండు పదాలు కలసి **"వేళుక్కై"** అని పరిణమించాయి. **"వేళ్"** అంటే - ఆశ. ఆశతో వేంచేసి ఉండే చోటు- అని **"వేళుక్కై"** అనే పదానికి అర్థం. **"కామాసికా"** అనే సంస్కృతపదంయొక్క అర్థంకూడా ఇదే. **"కామేన అసికా- కామాసికా"** అనే వ్యుత్పత్తి ఈ స్తోత్రంలోని మొదటి శ్లోకంలోనే **"కామాత్ అధివసన్"** అని ఈ అర్థం వివరింపబడింది. ఈ అర్థాన్నే **"మదనాసికా"** అని కూడా శ్రీదేశికులు సూచించారు. కామశబ్దం, మదనశబ్దం పర్యాయాలు కదా! (ద్విరేఫమనే పదంలో వలె) లక్షిత లక్షణాప్రక్రియలో ఈ నామనిర్దేశం చేయబడిందని కూడా చెప్పవచ్చు.

ఒక్కొక్క స్వామికి ఎనిమిది ఎనిమిది సంఖ్యలో దేశికులు స్తుతులను రచించడం **"ఇనమల రెట్టు మిట్టు"** అని, **"కన్ద మామలర్ ఎట్టు మిట్టు"** (సువాసనను కల ఎనిమిది పూలను తీసికొని) అని తిరుమజ్గై యాళ్వార్లు అనుగ్రహించిన రీతిలో అష్టవిధపుష్పాలను సమర్పించడంతో పోలుతుంది. **"అహింసా ప్రథమం పుష్పం పుష్పమింద్రియనిగ్రహః, సర్వభూతదయా పుష్పం క్షమా పుష్పం విశేషతః, జ్ఞానం**

**పుష్పం తపః పుష్పం ధ్యానం పుష్పం తథైవ చ, సత్య మష్టవిధం పుష్పం విష్ణోః ప్రీతికరం భవేత్"** (అహింస అనేది ప్రథమపుష్పం. ఇంద్రియ నిగ్రహం ఇంకొక పుష్పం. అన్ని ప్రాణులపట్ల దయ చూపడం పుష్పం, క్షమ అనేది ఒక విశేషమైన పుష్పం, జ్ఞానం, తపస్సు అనేవి పుష్పాలు, అదే రీతిలో సత్యమనేది ఎనిమిదవ పుష్పం. ఈ ఎనిమిది పూలు విష్ణువునకు ఇష్టమైనవి) అనే ప్రమాణాన్ని బట్టి అష్టవిధపుష్ప వివరణాన్ని గమనించవచ్చు. ఆణ్డాళ్ పామాలై వేఱుగాను, పూమాలై వేఱుగాను సమర్పించింది. ఆవిధంగా కాకుండా దేశికులు పామాలనే పూమాలగా సమర్పిస్తున్నారు.



1. **శ్రుతీనాం ముత్తరం భాగం వేగవత్యా శ్చ దక్షిణమ్ ।**
**కామాదధివసన్ జీయాత్ కశ్చిదద్భుతకేసరీ ॥**

శ్రుతీనామ్ = వేదాలకు, ఉత్తరం భాగం = ఉత్తరభాగం (శిరస్సు) అయిన ఉపనిషత్తులలో, వేగవత్యాః దక్షిణం చ = వేగవతీనదికి దక్షిణంలోను, కామాత్ = (భక్తుల పట్ల) ఆశవల్ల, అధివసన్ = వేంచేసి ఉండే, కశ్చిత్ = ఒకానొక అద్వితీయమైన, అద్భుత కేసరీ = అద్భుతసింహం, జీయాత్ = సర్వోత్కర్షతో ఉండాలి.

**"కశ్చిత్ అద్భుత కేసరీ జీయాత్"** అని అంటూ మంగళాశాసనంతో దేశికులు ఈ స్తుతిని ఉపక్రమిస్తున్నారు. దీనిద్వారా కావ్యాదిలో చేయవలసిన మంగళాచరణం చేయబడింది. ప్రకృతంలో అద్భుతం ఏమంటే– దక్షిణదిక్కులో ఉండేవారు ఉత్తరదిక్కులో ఉండడం సాధ్యం కాదు. ఉత్తర దిక్కులో ఉండేవారు దక్షిణదిక్కులో ఉండం సాధ్యం కాదు. అయితే, ఈ విలక్షణమైన కేసరి ఉభయ పార్శ్వాలలో వేంచేసి ఉండడమే అద్భుతం. రెండు పక్కల స్వామి ఏవిధంగా వేంచేసి ఉన్నాడు? – అని అంటే, శ్రుతుల ఉత్తరభాగంలోను, వేగవతీనదికి దక్షిణభాగంలోను ఉన్నాడు. ఉపనిషత్ప్రతిపాద్యుడైన స్వామి వేగవతీనదికి దక్షిణదిశలో సేవను అనుగ్రహించే తీరు దీనిద్వారా తెలుపబడింది. సర్వవ్యాపి అయిన భగవానుడు ఒక దేశవిశేషంలో వేంచేసి ఉండడం భక్తానుగ్రహార్థం, స్వసంకల్ప విశేషంవల్లనే కనుక ఆ విషయాన్ని **"కామాత్ అధివసన్"** అని అంటూ తెలియజేశారు. వేగవతీనది ఇపుడు ఈ స్థలానికి దక్షిణదిక్కులో ప్రవహిస్తున్నట్లు కన్పించినా, బ్రహ్మయాగానికి ఆటంకం కల్గించాలని ప్రవహించినపుడు

ఈ క్షేత్రానికి ఉత్తరదిశలోనే ప్రవహించి, వెక్కణై క్షేత్రంలో శయనించి ఉండే స్వామిని చూచి లజ్జించి, అంతర్వాహినిగా సాగినట్లు ఇతిహాసం కనుక, **"వేగవత్యా శ్చ దక్షిణం భాగం అధివసన్"** అని పల్కడంలో ఏ కొఱత లేదని భావం.

**2. తపనేంద్వగ్నినయన స్తాపా నపచినోతు నః ।**
**తాపనీయరహస్యానాం సారః కామాసికా హరిః ॥**

తపన+ఇందు+అగ్నినయనః= సూర్యుని, చంద్రుని, అగ్నిని కన్నులుగా కలవాడు, తాపనీయ రహస్యానాం = నృసింహతాపిన్యుపనిషత్తులోని రహస్యాలయొక్క, సారః = సారభూతమైనవాడైన, కామాసికాహరిః = **"వేళుక్కైయాళరి"** స్వామి, నః తాపాన్ = మనతాపాలను, అపచినోతు = పోగొట్టుగాక!

**"తిజ్గళు మాదిత్తియనుమ్ ఎழுన్దాఱ్పోల్ అజ్గణ్ ఇరణ్డుమ్ కొణ్డు ఎజ్గళ్మేల్ నోక్కుతియేల్"** (చంద్రుడు, సూర్యుడు ఉదయించినట్లుగా ఉండే అందమైన నీ నేత్రాలు రెండిటితో మమ్ములను కటాక్షిస్తే) అనే రీతిలో చంద్రసూర్యులవంటి తిరునేత్రాలతో మన పాపాలను స్వామి హరించుగాక! అని భావం. **"హరి ర్హరతి పాపాని"** (హరి అన్ని పాపాలను హరిస్తాడు) అనే సూక్తి హరిశబ్ద ప్రయోగ స్వారస్యానుగుణంగా స్మరణీయం.

**3. ఆకంఠ మాదిపురుషం కంఠీరవ ముపరి కుంఠితారాతిమ్ ।**
**వేగోపకంఠసంగాద్విముక్త వైకుంఠబహుమతి ముపాస్తే ॥**

ఆకంఠమ్ ఆదిపురుషమ్ = కంఠంవరకు పురాణపురుషుని రూపం, ఉపరి = ఆపైన, కంఠీరవం = సింహముఖంగా ఆవిర్భవించినవాడు, కుంఠిత + అరాతిం = హిరణ్యకశిపునకు శత్రువైనవాడు, వేగా+ఉపకంఠసంగాత్ = వేగవతీ సమీప నివాసంలోని అభిరుచివల్ల, విముక్తవైకుంఠ బహుమతిం = వైకుంఠంలో ఆదరాన్ని విడిచిపెట్టినవాడు అయిన భగవానుని, ఉపాసే = ఉపాసిస్తున్నాను.

హిరణ్యకశిపుడు పొందిన వరాలు వ్యర్థం కాని రీతిలో ఆవిర్భవించి, అతనిని సంహరించవలసి వచ్చినందువల్ల **"నరజ్కలన్ద శిజ్గమాయ్"** (నరరూపం కలసిన సింహరూపుడై) ఆవిర్భవించాడు. కంఠానికి క్రిందిభాగం ఒక రూపంలోను, పైన ఒక రూపంలోను ఆవిర్భవించి, శత్రసంహారాన్ని చేసిన రీతిని పూర్వార్ధంలో తెలిపారు. తాను అభిమానించిన దివ్యదేశాలలో వర్తించేటపుడు పరమపదంలో కల్గి ఉండే అభినివేశాన్ని ఇక్కడ కల్గి ఉండే రీతిని ఉత్తరార్ధంలో అనుగ్రహించారు.

**"సత్యం విధాతుం నిజభృత్య భాషితమ్"** (తన భృత్యుని మాటను నిజం చేయడం కోసం) అనే నృసింహావతార హేతువును నిరూపించే భాగవత శ్లోకార్థం మొదటి పాదానికి అనుగుణంగా, **"శ్రీవైకుంఠవిరక్తాయ... స్వామిపుష్కరిణీతటే రమయా రమమాణాయ"** (శ్రీవైకుంఠం పట్ల విరక్తిని పొందినవాడు... స్వామి పుష్కరిణీతీరంలో లక్ష్మితో ఆనందించేవాడు) అనే శ్రీవేంకటేశమంగళస్తోత్రప్రయోగార్థం ఉత్తరార్థానికి అనుగుణంగా అనుసంధేయాలు.

**4. బంధు మఖిలస్య జంతోః బంధురపర్యంకబంధరమణీయమ్ ।**
**విషమవిలోచన మీడే వేగవతీపులినకేలినరసింహమ్ ॥**

అఖిలస్య జంతోః = సమస్తప్రాణులకు, బంధుః = సర్వవిధబంధువు, బంధుర పర్యంకబంధరమణీయమ్ = అందమైన పర్యంకబంధాన్ని కల్గి, అత్యంతం రమణీయంగా ఉన్నవాడు, (రెండవ శ్లోకంలో తెల్పిన రీతిలో), విషమవిలోచనం = విషమ సంఖ్యలో (మూడు) తిరునేత్రాలను కలవాడు, వేగవతీపులిన కేలి నరసింహమ్= వేగవతీనదీ తీరంలోని ఇసుకల తిన్నెలపై విహరించడంలో రసికుడైన నరసింహ స్వామిని, ఈడే = స్తుతిస్తున్నాను.

**"మాతా పితా భ్రాతా నివాస శ్శరణం సుహృద్గతి ర్నారాయణః"** (తల్లి, తండ్రి, సోదరుడు, నివాసం, స్నేహితుడు, గతి– అన్నీ నారాయణుడే) అని సంస్కృతవేదం, **"శేలేయ్ కణ్ణియరుమ్ పెరుమ్ శెల్వముమ్ నన్మక్కళుమ్ మేలా త్తాయ్ తన్దైయుమ్ అవరే యిని యావారే"** (చేపలవంటి కన్నులను కల కాంతలు, గొప్ప సంపద, సత్సంతానం, ఇంకా, తల్లి, తండ్రి అందఱు ఆ భగవంతుడే) అని ద్రావిడవేదం ఉద్ఘోషించిన రీతిలో సమస్తప్రాణులకు సకలవిధబంధువై, పర్యంకబంధమని చెప్పబడే ఆసనబంధవిశేషంతో పరమభోగ్యమైనవాడు, కార్యార్థంగా ఆరోపించుకొన్న, మూడవది అయిన ఫాలనేత్రాన్ని కలవాడు, వేగవతీనదీతీరంలో ప్రకాశించేవాడు అయిన **"వేళుక్కైయాళరి"**ని స్తుతిస్తున్నాను– అని భావం.

**5. స్వస్థానేషు మరుద్గణాన్ నియమయన్ స్వాధీనసర్వేంద్రియః**
**పర్యంకస్థిరధారణాప్రకటితప్రత్యఙ్ముఖావస్థితిః ।**
**ప్రాయేణ ప్రణిపేదుషాం ప్రభు రసౌ యోగం నిజం శిక్షయన్**
**కామా నాతనుతా దశేషజగతాం కామాసికా కేసరీ ॥**

మరుద్గణాన్ = దేవసమూహాలను (ప్రాణాపానాది వాయుసమూహా లను), స్వస్థానేషు = తమ స్థానాలలో, నియమయన్ = నియమిస్తున్నవాడు, స్వాధీనసర్వేంద్రియః= అందటి ఇంద్రియాల వృత్తులను తన స్వాధీనంలో కలవాడు, తన సకలేంద్రియాలను తన స్వాధీనంలో కలవాడు, పర్యంకస్థిరధారణాప్రకటిత = పర్యంకమనే ఆసన విశేషంతో కూడి, ప్రత్యఙ్ముఖ+అవస్థితః= పడమటి దిక్కును చూస్తూ వేంచేసి ఉన్నవాడు, (ఆసనవిశేషస్థైర్యంతో పరాగర్థావలోకనం లేకుండా ప్రత్యగర్థావలోకననిష్ఠుడైన వాడు), ప్రణిపేదుషాం = తనను ఆశ్రయించినవారికి, నిజం యోగం = తన యోగాన్ని, ప్రాయేణ శిక్షయన్ = ప్రాయికంగా అభ్యసింపజేసే వాడైన, అసౌ ప్రభుః కామాసికాకేసరీ = ఈ కామాసికానరహరి స్వామి, అశేష జగతాం = సమస్తలోకానికి, కామాన్ ఆతనుతాత్ = కోరికలను పూర్తి చేయాలి.

ఈ శ్లోకంలో ఆశ్చర్యకరమైన శ్లేషాలంకారం ఉన్నది. నరసింహ భగవానునకు యోగనరసింహమనికూడా వ్యవహారం ఉన్నది. యోగాసనంలో ఉండే నరసింహస్వామి- అని దీని అర్థం. యోగాసనంలో సమర్థుడైన నరసింహస్వామి- అనే అర్థాన్ని గ్రహించడంలో ఔచిత్యమున్నదని తలచి, ఆ అర్థానికి తగిన రీతిలో శ్లేషభంగిలో అనుగ్రహించారు, దేశికులు.

**(స్వస్థానేషు మరుద్గణాన్ నియమయన్)**- మరుద్గణమనే పదానికి దేవతాసమూహమని, వాయుసమూహమనే అర్థాలు ప్రసిద్ధం కదా ! నృసింహమూర్తి పరమపురుషుడు కనుక **"భీషాస్మాద్వాతః పవతే భీషోదేతి సూర్యః"** (పరమాత్మ భయం వల్ల గాలి వీస్తున్నది. సూర్యుడు ఉదయిస్తున్నాడు) ఇత్యాది శ్రుత్యనుసారం సకలదేవతాసమూహాలను వారి వారి స్థానాలలో నియమించగల్గిన సామర్థ్యాన్ని కలవాడై ఉంటాడు. యోగి, ప్రాణాపానాది పంచవాయువులను వాటివాటికి తగిన స్థానాలలో నియంత్రించగల్గిన సమర్థుడై ఉంటాడు.

**(స్వాధీనసర్వేంద్రియః)- "సర్వేషాం ఇంద్రియాణి స్వాధీనాని యస్య"**అని నృసింహస్వామి పక్షంలో విగ్రహవాక్యాన్ని చెప్పాలి. **"సర్వాణి చ తాని ఇంద్రియాణి సర్వేంద్రియాణి, తాని స్వాధీనాని యస్య"** అని యోగిపక్షంలో విగ్రహం. సర్వేశ్వరుడు హృషీకేశుడు కనుక అందటి ఇంద్రియాల వృత్తులను స్వాధీనంలో కలవాడై ఉంటాడు. యోగి అయినవాడు జితేంద్రియుడై ఉంటాడు.

**(పర్యంకస్థిర ధారణాప్రకటిత ప్రత్యఙ్ముఖావస్థితిః)–** పర్యంకాసనమనబడే యోగాసన విశేషాన్ని పరిగ్రహించి, పడమటి ముఖంగా సేవను అనుగ్రహిస్తున్నాడు, నృసింహస్వామి. ఇక, యోగి విషయంలో అయితే, ఆ ఆసనవిశేషంలో ఊనికను కల్గి, పరాగర్థ విముఖుడై ప్రత్యగర్థాభిముఖుడై ఉంటాడు. అందువల్ల ఆవిధంగా ఉంటూ ఉపాసకులకు స్వకీయయోగాన్నిగూర్చి నేర్పిస్తున్నాడు కాబోలు ! అని ఉత్ప్రేక్షించేటట్లు వేంచేసి ఉండే కామాసికా నృసింహస్వామి సకలజగత్తుకు వారి వారి అపేక్షితాలను అనుగ్రహిస్తున్నాడు.

**6. వికస్వరనఖస్వరుక్షతహిరణ్యవక్షఃస్థలీ–**
**నిరర్గళ వినిర్గళద్రుధిరసింధుసంధ్యాయితాః ।**
**అవంతు మదనాసికామనుజపంచవక్త్రస్య మామ్**
**అహంప్రథమికా మిథః ప్రకటితాహవా బాహవః ॥**

వికస్వర = వికసించిన, నఖ = నఖాలనే, స్వరు = వజ్రాయుధంచేత, క్షత = బ్రద్దలు చేయబడ్డ, హిరణ్య = హిరణ్యకశిపుని, వక్షఃస్థలీ = వక్షఃస్థలంనుండి, నిరర్గళ= అడ్డు లేకుండా, వినిర్గళత్ = బయటకు ప్రవహించే, రుధిర = రక్తం యొక్క, సింధు= నదిచేత, సంధ్యాయితాః= ఎఱ్ఱబడినవి, మదనాసికామనుజవక్త్రస్య = తిరువేళుక్కై లోని నృసింహస్వామియొక్క, బాహవాః= బాహువులు, అహం ప్రథమికా = అహం పూర్విక అయిన (నేను ముందు, నేను ముందు– అనే భావాన్ని), మిథః ప్రకటితాహవాః= పరస్పరం ప్రకటించిన వివాదాన్ని కల్గినవై, మాం = నన్ను, అవంతు = రక్షించుగాక!

ఈ శ్లోకంలో పూర్వార్థం అంతా ఒకే పదం. **"స్వరు"** అన్నది. వజ్రాయుధానికి పేరు. వికసించిన నఖాలనే వజ్రాయుధంతో హిరణ్యకశిపుని వక్షఃస్థలం బ్రద్దలు చేయబడింది. దానినుండి పుంఖానుపుంఖంగా రక్తప్రవాహం పెల్లుబికింది. అందువల్ల, అపుడు సంధ్యాసమయంవలె నృసింహస్వామి బాహువులు ఉన్నవట. అంటే– ఎఱ్ఱని వర్ణాన్ని కల్గినవి అయినవి– అని భావం.

**(మదనాసికామనుజవక్త్రస్య బాహవః) – "వేళుక్కైయాళరి"** యొక్క బాహువులని భావం. అవి ఏమి చేయాలి? అని అంటే–

**(అహంప్రథమికామిథఃప్రకటితాహవాః సంతః మామ్ అవంతు)–** నేను ముందు రక్షించాలి, నేను ముందు రక్షించాలి" అని పరస్పరం స్పర్థిస్తూ, నన్ను రక్షించాలి–

అని భావం. "నేనే ముందు, నేనే ముందు" అనే వివాదం **"అహంప్రథమికా"** అనబడుతుంది.

**7. సటాపటలభీషణే సరభసాట్టహాసోద్భటే**
**స్ఫురత్క్రుధిపరిస్ఫుటభ్రుకుటికేఽపి వక్త్రే కృతే ।**
**కృపాకపటకేసరిన్ ! దనుజడింభదత్తస్తనా**
**సరోజసదృశాదృశా వ్యతివిషజ్యతే వ్యజ్యతే ॥**

కపటకేసరిన్ = మాయాన్నృసింహమూర్తీ!, తే వక్త్రే = నీ తిరుముఖం, సటాపటలభీషణే = సటల సమూహంచేత భయంకరంగాను, సరభసహాస+ఉద్భటే= సాటోపంగా చేసిన అట్టహాసం చేత (గర్జనల చేత) క్రూరంగాను, స్ఫురత్ = వ్యక్తమైన, క్రుధి= క్రోధాన్ని కల్గినదిగాను, పరిస్ఫుటభ్రుకుటికే అపి = ప్రకాశించే కనుబొమలను కల్గినదిగాను అయినా, దనుజడింభ = అసురబాలకుడైన ప్రహ్లాదునకు, దత్త = ఇవ్వబడ్డ, స్తనా = స్తన్యాన్ని కల్గినదైన, తే కృపా = నీ కృప, సరోజసదృశా = తామరలవంటి కన్నులతో, వ్యతివిషజ్య = చేరినదై (కల్గినదై), వ్యజ్యతే = ప్రకాశిస్తున్నది.

**"అజ్గణ్ ఞాల మఞ్జ అజ్గోరాళరియాయ్"** (విశాలమైన భూమిలోని వారంతా భయపడేటట్లు అక్కడ అద్వితీయ నృసింహమై) అని, **"ఎరిన్ద పైజ్కణికళిలజ్గ పేళ్ వాయ్ ఎయిఱ్ఱొడు ఇదెవ్వురువెన్ఱు ఇరున్ద వానోర్ కలజ్గి యోద విరున్ద అమ్మాన్"** (జ్వలించే నేత్రాలు ప్రకాశించగా, బయటకు పొడుచుకొన వచ్చే కోరలతో, "ఇదేమి రూపం!" అని దేవతలు భీతిల్లి పారిపోయేటట్లుండే స్వామి)అని పల్కిన రీతిలో మహాభయంకరరూపిగా నృసింహుడు ఆవిర్భవించినా, **"స్మేరాననాక్షికమలైః నమతః పునానాన్, దంష్ట్రాగదాభ్రుకుటిభిః ద్విషతో ధునానాన్"** (నమస్కరించేవారిని చిఱునవ్వును కల, తామరలవంటి నేత్రాలతో పవిత్రం చేస్తూ, కోఱపళ్ళతో, గదతో, కనుబొమలతో భక్తవిరోధులను నిరసిస్తూ) అనే రీతిలో శత్రువులకు సమీపించడానికి వీలులేకుండా, అనుకూలురకు సౌమ్యంగా ఉంటుంది కదా!, స్వామి తిరుముఖ మండలం. ఆ విషయాన్ని ఇందులో దేశికులు అనుగ్రహిస్తున్నారు.**"వక్త్రే"** అనే విశేష్యానికి నాల్గు విశేషణాలను ప్రయోగిస్తున్నారు. సటాపటలాలతో (జూలుతో) భయంకరంగాను, సింహగర్జనలతో ఉద్భటంగాను ఉండే సన్నివేశానికి మించి, కోపాన్ని ఎత్తిన కనుబొమలను ఆరోపించుకోవడంచేత ఆసురప్రకృతిని కలవారికి దరిచేరడానికి వీలుకాని స్వామి స్థితి తెలుపబడినట్లయినది. ఈ స్థితిలోకూడా **"పళ్ళియిల్ ఓదివన్ద**

**శిఱుక్కన్ మేల్ తిరువరుళ్వెళ్ళమ్"** (పాఠశాలలో విద్యాభ్యాసం చేసి వచ్చిన బాలకుడైన ప్రహ్లాదునిపై కృపాప్రవాహం) ఏలోటు లేకుండా ఉన్న స్థితి ఉత్తరార్ధంలో తెలుపబడు తున్నది.

**(దనుజడింభదత్తస్తనా కృపా)–** భగవానుని కృప ప్రహ్లాదాళ్వాన్‌కు స్తన్యపానాన్ని చేయిస్తున్నట్లు ఇక్కడ పల్కడం "అతనిని భయపడనీయకుండా పోషిస్తున్నాడనే తాత్పర్యంలోనే. తిరువాయ్‌మొழிలోని– **"శీగ్ఱత్తోడు అరుళ్‌పెఱ్ఱవనడిక్కీழ் పుకనిన్ఱ శెజ్ఞణ్‌మాల్"** అనేచోట ఈడు ముప్పత్తాఱాయిరప్పడివ్యాఖ్యలో గల **"హిరణ్యన్ పక్కల్ శీగ్ఱమ్ శెల్లానిఱ్క శ్రీప్రహ్లాదాழ்వానుక్కు క్కిట్టలా యిరున్దపడి ఎజ్ఞనే? ఎన్ఱు ఎమ్బెరుమానారై చ్చిలర్, కేట్క – సింహమ్ ఆనైమేలే శీఱినాలుమ్ కుట్టిక్కు ములై యుణ్ణలామ్పడి యిరుక్కుమితే" – ఎన్ఱు అరుళిచ్చెయ్‌దార్. ఆశ్రిత వాత్సల్యత్తాలే అవర్‌కళ్‌విరోధికళ్‌మేలే శీఱిన శీగ్ఱమానాల్ పిన్నై అవర్‌కళుక్కు అణైయవొణ్ణాతపడి యిరుక్కుమో? ఎన్ఱు అరుళిచ్చెయ్‌దార్"** (హిరణ్యకశిపునిపట్ల కోపాన్ని కల్గిఉన్నా, ప్రహ్లాదునకు దగ్గరకు చేరగలిగేటట్లు ఉండడం ఏవిధంగా సంభవం? అని శ్రీరామా నుజులను కొందఱు ప్రశ్నించగా సింహం, ఏనుగుపై కోపించినా, తన పిల్ల తన దగ్గరపాలు తాగగలిగేట్లు ఉంటుంది కదా – అని బదులిచ్చారు ఆశ్రివాత్సల్యంతో భక్త విరోధులపై కోపించినా, ఆ భక్తులకు దరిచేరదానికి వీలుకానట్లు భగవంతు దుంటాడా? ఉండదు కదా!) అనే సంవాదం ఇక్కడ అనుసంధేయం. భగవద్రామానుజులు అనుగ్రహించిన ఈ సూక్తి **"ఇழవు తరియాతతోరీగ్ఱుప్పిడి యిలజ్ఞియమ్ తొడర్‌న్దు ముడుకుతలుమ్ కుழవియ్యిడక్కాలిట్టెతిర్‌న్దు పొరుమ్ కోవర్‌త్తనమ్"** అనే పెరియాழ்వార్ తిరుమొழிని అనుసంధిస్తున్నది. ఈ సందర్భాలలో స్తన్యపానాన్ని చేయించడాన్ని గూర్చి ప్రస్తావించడాన్నిబట్టే దేశికులు ఇక్కడ **"దత్తస్తనా"** అని ప్రయోగించారని తెలియాలి.

**(సరోజసదృశా దృశా వ్యతివిషజ్య)–** ఈ అష్టకస్తుతిలోని మొదటి శ్లోకంలో **"తపనేందృగ్నినయనః"** అనే సూక్తిలో ఇది కూడా అంతర్భవించడం ఆశ్రితులకు సౌమ్యత్వం కోసమేకదా! అపుడే వికసించిన కెందామరలవంటి నేత్రాలలో కృపా ప్రవాహాన్ని దర్శించవచ్చు. **"సరోజసదృశా దృశా సముదితాకృతిః దృశ్యతే"** అనే పాఠాంతరాన్ని కొందరు పఠిస్తారు.

**8. త్వయి రక్షతి రక్షకైః కిమన్యైః త్వయి చారక్షతి రక్షకైః కిమన్యైః ।
ఇతి నిశ్చిత ధీః శ్రయామి నిత్యం నృహరే ! వే గవతీతటాశ్రయం త్వామ్ ॥**

నృహరే = ఓ నృసింహమూర్తీ !, త్వయి రక్షతి సతి = నీవు రక్షకుడవైతే, అన్యైః రక్షకైః కిమ్ = మిగిలిన రక్షకులతో ఏమి పని?, త్వయి అరక్షతి సతి = నీవు రక్షకుడవు కానపుడు, అన్యైః రక్షకైః కిమ్ = ఇతరరక్షకులతో ఏమి పని?, ఇతి నిశ్చితధీః= అనే నిశ్చయాన్ని కల్గిన నేను, వేగవతీతటాశ్రయం = వేగవతీ నదీ తీరాన్ని ఆశ్రయించిన, త్వాం = నిన్ను, నిత్యం శ్రయామి = నిత్యం ఆశ్రయిస్తున్నాను.

భగవానునికంటే అన్యులు రక్షకులు కారు– అనే విషయం ప్రపన్న పరిత్రాణమనే గ్రంథంలో నిరూపితం. కనుక, దానిని స్థిరీకరించాలనే ఉద్దేశ్యంతో ప్రస్తుత శ్లోకాన్ని దేశికులు అనుగ్రహించారు. సర్వేశ్వరుడు చేయివిడువకుండా రక్షించినపుడు ఇతర రక్షకులను వెదకి వేసారి పోనక్కరలేదు. అతడు రక్షించాలని అనుకోకుండా, చేయి విడచినపుడుకూడా రక్షకాంతరాన్వేషణం విఫలం– అనే స్థిరమైన నిశ్చయాన్ని తాము కల్గి ఉన్న రీతిని దేశికులు దీనిద్వారా తెలిపారు. అష్టభుజాష్టకంలో **"త్వయి ప్రవృత్తే మమ కిం ప్రయాసైః ? త్వయ్యప్రవృత్తే మమ కిం ప్రయాసైః"** (నీవు నా రక్షణకోసం ప్రయత్నిస్తే ఇక నా ప్రయత్నం ఎందుకు? నీవు ప్రయత్నించక పోతే ఇక నా ప్రయత్నాలతో ఏమి ప్రయోజనం?) అని పల్కడం దీని పర్యాయమే.

**9. ఇత్థం స్తుతః సకృదిహోష్టభిరేవ పద్యైః
శ్రీవేంకటేశరచితైః త్రిదశేంద్రవంద్యః ।
దుర్దాంతఘోరదురితద్విరదేంద్రభేదీ
కామాసికా నరహరి ర్వితనోతు కామాన్ ॥**

ఇత్థం = ఈవిధంగా, ఇహ= ఇక్కడ, వేంకటేశరచితైః= వేదాంతదేశికుల చేత రచింపబడ్డ, అష్టభిః పద్యైః= ఎనిమిది శ్లోకాలతో, త్రిదశేంద్రవంద్యః= దేవేంద్రసేవ్యుడై, దుర్దాంత = భరించ లేని, ఘోర= భయంకరాలైన, దురిత = పాపాలనే, ద్విరద+ఇంద్ర= గొప్ప ఏనుగులను, భేదీ = భేదించేవాడైన, కామాసికా నరహరిః= కామాసికా నృసింహుడు, సకృత్ స్తుతః= ఒక్క పర్యాయం స్తుతింపబడినవాడై, కామాన్= అభీష్టాలను, వితనోతు = పూర్తిచేయుగాక !

తాము అనుగ్రహించిన ఈ స్తుతిని అనుసంధించేవారికి సర్వాభీష్టాలు సిద్ధిస్తాయి– అని ఫలశ్రుతిని పల్కి ఈ స్తుతిని దేశికులు నిగమిస్తున్నారు. **"సకృత్**

**స్తుతః"** అనేది దేశికులు ఒకసారి స్తోత్రం చేశారనే అర్థాన్ని ఇవ్వదు. **'వేంకటేశేన'** అని వ్యస్తంగా ఉంటే ఈవిధంగా అర్థాన్ని చెప్పవచ్చు. **"వేంకటేశరచితైః పద్యైః సకృత్ స్తుతః"** అని ఉన్నందువల్ల, దీనితో ఎవరైనా ఒకసారి స్తుతించినా వారికి సర్వాభీష్టాలు సిద్ధిస్తాయి– అన్నదే అర్థం.

**(దుర్దాంతఘోరదురిత ద్విరదేంద్రభేదీ) –** సింహానికి ఏనుగుల కుంభ స్థలాలను పగులగొట్టడం సహజకృత్యం. ఈ కామాసికా హరి ఏ ఏనుగులను భేదిస్తున్నది? అని అంటే, ఏనాటికీ తీరని ఘోరపాపాలు అనే ఏనుగులను భేదించగల్గినది. సకలానిష్టనిరసనపూర్వకంగా సర్వాభీష్టప్రదానాన్ని చేసి, రక్షించగలవాడు, కామాసికాహరి– అని అంటూ స్తుతిని దేశికులు పరిసమాప్తం చేశారు.

**కామాసికాష్టకవ్యాఖ్యా శింగరార్యేణ నిర్మితా ।**
**దేశికోక్తిసుధా స్వాదాసక్తస్వాంతముదే భవేత్ ॥**



శ్రీవేదాంతదేశికులు అనుగ్రహించిన

# వైరాగ్య పంచకమ్

## సవ్యాఖ్యానము

**శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కికకేసరీ ।**
**వేదాంతాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది ॥**

## అవతారిక

తిరుమల ఆలయంలోని శ్రీవేంకటేశ్వరుని ఘంటయొక్క అంశతో ఆవిర్భవించిన శ్రీదేశికులు సర్వతోముఖ ప్రజ్ఞను, సంపూర్ణజ్ఞానాన్ని కల్గినవారు అయినట్లే, లోకవిలక్షణమైన వైరాగ్యాన్నికూడా కల్గినవారు. అందువల్ల కూరేశులవలెనే తాము ఉంఛవృత్తితోనే భగవదారాధనకు ఏలోటూ లేకుండా నిర్వహిస్తూ, సంస్కృత-ద్రావిడభాషావిద్వాంసులకు పలువురికి ఉభయవేదాంత గ్రంథ ప్రవచనాన్ని చేస్తూ ఉండేవారు. వీరితో బాల్యంనుండి మైత్రిని కల్గి ఉన్న శ్రీవిద్యారణ్యస్వామి విజయనగర ప్రభువుల దగ్గర చాలా పలుకుబడిని కలవారు. పలువురు విద్వాంసులను ప్రభువులద్వారా ఆదరించినవారు. శ్రీదేశికుల జ్ఞానవైభవాన్ని గమనించిన విద్యారణ్యులు శ్రీదేశికుల బీదతనాన్ని ఏవిధంగానైనా తీర్చాలని, వారిని సంపన్నులుగా చేయాలని తలచి, ఒక పర్యాయం శ్రీదేశికులను విజయనగరప్రభువుల దగ్గరకు వేంచేయవలసినదిగా వారి వద్దకు ప్రార్థనా పత్రికను పంపించారు. ఆ పత్రికను చూచిన దేశికులు తమ నిష్ఠను తెలిసిన విద్యారణ్యస్వామి వ్యర్థంగా ఈ రీతిలో తమను ప్రభువుల దగ్గరకు రమ్మని పిలిచారుకదా!- అని మనస్సులో కొంచెం నొచ్చుకొని, తమ వద్దకు పంపిన ఆహ్వాన పత్రికకు సమాధానంగా **"న మే పిత్రార్జితం కించిన్న మయా కించిదార్జితమ్, అస్తి మే హస్తిశైలాగ్రే వస్తు పైతామహం ధనమ్"** అనే శ్లోకాన్ని వ్రాసి పంపించారు. విద్యారణ్యస్వామి ఆ శ్లోకాన్ని చూచికూడా, దేశికులపై తమకున్న ఆదరాతిశయంవల్ల ఏవిధంగానైనా వారికి అపరిమిత ధనయోగాన్ని కల్గించాలనే ఆశతో మళ్ళీ చాలా నిర్బంధంగా ఆహ్వానపత్రికను పంపించారు. అపుడు శ్రీదేశికులు సమాధానంగా వ్రాసి పంపిన అయిదు శ్లోకాలు **"వైరాగ్యపంచకమ్"** అనే పేరుతో ప్రసిద్ధిని పొందాయి. ఈ శ్లోకాలలోని విశేషాలు సంగ్రహంగా నివేదింప బడుతున్నవి.



1. క్షోణీకోణశతాంశపాలనకలా దుర్వారగర్వానల-
క్షుభ్యత్క్షుద్రనరేంద్ర చాటురచనాధన్యాన్ న మన్యామహే ।
దేవం సేవితు మేవ నిశ్చినుమహే యోఽసౌ దయాళుః పురా
ధానాముష్టిముచే కుచేలతనయే దత్తే స్మ విత్తేశతామ్ ॥

భూమండలంలోని ఏదో ఒక మూలలోని నూఱు భాగాలలో ఒక భాగాన్ని పాలించడమనే కార్యంవల్ల అడ్డగించడానికి సాధ్యం కాని గర్వాగ్నితో క్షోభిల్లచేయబడిన అల్పప్రభువులను కీర్తించడం ద్వారా సంపదను పొందేవారిని ఒక వస్తువుగా నేను పరిగణించను. ఇక, మా అధ్యవసాయం ఎటువంటిది? అని అంటే, దయను కల్గిన ఏ భగవానుడు పూర్వం ఒక పిడికెడు అటుకులను సమర్పించిన కుచేలునకు కుబేరత్వాన్ని అనుగ్రహించాడో, ఆ పరమపురుషుని పాదసేవను చేయడం కోసమే నిశ్చయించుకున్నాము.

**"ఒరు నాయకమాయ్ ఓడ ఉలకుడన్ ఆణ్డవర్"** అనే రీతిలో భూమండలాన్ని అంతటినీ ఏకచ్ఛత్రాధిపత్యంగా పాలించ గల్గినవారెవ్వరూ ఇపుడు లేరు. భూమిలోని అత్యల్పభాగాన్ని పాలించే అల్పప్రభువులే ప్రస్తుతం ఉన్నారు. ఈ మాత్రం అల్పాధికారానికే వీరికి కలిగే గర్వం వాచామగోచరం. ఈ గర్వంవల్ల నిప్పును తొక్కినట్లు గంతులేసే ఆ అల్పుల దగ్గరకు పోయి 'నీవు ఇంద్రుడవు, కుబేరుడవు" అని లేని గొప్పతనాన్ని వారిలో ఆరోపిస్తూ, అసత్యాలను కూరుస్తూ, కీర్తిస్తూ జీవించే జీవితాన్ని ఒక జీవితంగా భావించను. **"ఉనక్కు ప్పణిశెయ్దిరుక్కుమ్ తవముడైయేన్, ఇనిప్పోయ్ ఒరువన్ తనక్కు ప్పణిన్దు కడత్తలై నిఱ్కై నిన్ శాయై యఴివు కణ్డాయ్ !"** (నీకు కైంకర్యాన్ని చేసే గొప్ప తపస్సును కల్గినవాడను నేను. ఇక ఇపుడు నేను ఇంకొకనికి సేవ చేస్తూ అతని వాకిలి గడపదగ్గర పడి ఉండడం నీ అపకీర్తికి కారణంసుమా !) అనే రీతిలోని దృఢాధ్యవసాయాన్ని కల్గిన నేను ఈ భగవానుని తప్ప ఇంకొకని ఇంటి గడపలో ప్రవేశించి, దుఃఖపడను. భగవానునకు కైంకర్యాన్ని చేసేవారికి ఐహికంలో కూడా ఏ కొఱత ఉండదుకదా ! ఆ స్వామి అల్ప సంతుష్టుడు- అనే విషయం కుచేలోపాఖ్యానరూపంలో చక్కగా వ్యక్తమవుతున్నది. అందువల్ల ఆముష్మికం కోసం ఐహికాన్ని పొందడంకోసంకూడా భగవానుని అనుగ్రహం కోసం ఎదురుచూడడమే కదా ప్రపన్నుని కర్తవ్యం- అని దీనివల్ల తెలుపబడినట్లయింది.

